అంకితం

మధుర మందహాస భాసితులు,

సరసులు, సాహిత్య ప్రియులు,

జాతీయవాది, ప్రముఖ విద్యావేత్త,

సుప్రసిద్ధ వైద్య విద్యా ప్రవీణులు,

శస్త్రవైద్య నిపుణులు, ఉదారులు,

నిరాడంబరులు, దయార్ద్ర హృదయులు,

వైద్యకళాశాల ప్రధాన అధ్యాపకులు,

డాక్టర్ పిన్నమనేని నరసింహారావుగారికి

కృతజ్ఞతాపూర్వకంగా-

మురయా

# న మ స్సు లు

ఈకథలు ఇంతకు పూర్వం ప్రచురించిన భారతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, యువ పత్రికాధిపతులకూ, సంపాదకులకూ,

ఈ పుస్తకం అంకితం పుచ్చుకోడానికి దయతో అంగీకరించిన గుంటూరు వైద్య కళాశాల ప్రిన్సిపాల్ డా॥ పిన్నమనేని నరసింహా రావుగారికి,

కోరిన వెంటనే ముఖచిత్రం చిత్రించి ఇచ్చిన మిత్రుడు, కవి, ప్రముఖ చిత్రకారుడు శ్రీ మడిపడగ బలరామాచార్యులుగారికి,

అడిగిన వెంటనే నాయందభిమానంతో పీఠిక వ్రాసి ఇచ్చిన ఉస్మానియా విశ్వవిద్యాలయ కళాశాల అధ్యాపకులు, మిత్రులు శ్రీ మొదలి నాగభూషణశర్మగారికి,

ఉత్తమ కళాకారులు, శిల్పి, నయవినయ గుణసంపన్నులు, కీ॥ శే॥ మడిపడగ రాజయ్యగారి పేరిట నెలకొల్పబడిన రాజ్యశ్రీ ప్రచురణ సంస్థ నిర్వాహకులకూ,

ఈ పుస్తకం ప్రచురణకు అనేక విధాలుగా సహాయం చేసిన మిత్రులు శ్రీ ములుకాల సంజీవరావుగారికి, శ్రీ చందా రాజేశ్వరరావు గారికి,

ఈ పుస్తకం చక్కగా ముద్రించిన టి ఎన్ ఆర్ ముద్రణాలయాధి పతులు, కవి పండిత పోషకులు శ్రీ టి. నాగేశ్వరరావు, B.Sc., (Agr) గారికి – నమస్సులు.

మురయా

# నిత్యమల్లి

'ఇక పిల్లవిషయమంటారా రత్నం అనుకోండి. అందచందాల విషయంలో విరోధం ఉన్న వాళ్ళుకూడా వంక పెట్టలేరనుకోండి. నాపిల్ల విషయం ఇల్లాఅనక మరోలా ఎల్లాఅంటాను అనికాదు నామట్టుకు నేను ప్రాణంమీదకువచ్చినా అబద్ధమన్నది ఆడను. ఇంతెందుకూ మీరు వచ్చి చూడండి. చూచి, నేనన్నదాంట్లో. ఒక్క అక్షరం పొల్లుంటే అప్పుడుఅక్కడే నాలుగుజాడించి వేయచ్చు ఆ అందుకేమీ అభ్యంతరంలేదు.

'అయినా అబద్ధాలాడేదాకానూ, హెచ్చులు పోయేదాకానూ నా కేంపని!

'కానైతే మీరు ఓరకంగా అనుమానించవచ్చు. అంతఅందమైన మా అమ్మాయికి అందులో నాలుగువేలు కట్నం ఇస్తామంటూఉంటే మంచిసంబంధం ఎందుకురాలేదూఅని. ఆమాటకొస్తే సంబంధాలు రాక పోలేదు. చాలావచ్చాయి. ఎన్నిచోట్లకో వెళ్ళివచ్చాను. కాని అన్నివిధాలా అనువైనది ఒక్కటీ నాకంటపడలేదు. ఆస్తిఉంటే చదువు ఉండదు. కాస్త చదువుంటే సెంటుపొలం ఉండదు. రెండూఉంటే పిల్లవాడు బుద్ధిమంతుడుగా ఉండదు. కాదు ఈ మూడూ ఓమోస్తరుగా ఉన్నాయిలే అనుకొని సిద్ధిచెప్పుకొని వాళ్ళ గుమ్మంముందుకు వెళితే వాళ్ళు గొంతెమ్మకోరికలు కోరుతూ కొండెక్కి కూర్చుంటారు. అందుకూ సిద్ధపడ్డాను. కాని సంప్రదాయం! కాస్త విచారించేసరికి ఆ సంబంధంకోసం పడ్డశ్రమంతా వృథాఅయిపోయె. చదువుకొన్నవారు మీరుచెప్పండి—కుటుంబ సంప్రదాయం అన్నది బాగుండకపొయ్యాక ఇంక ఆ పైని ఎన్నిఉండి ఏం ప్రయోజనమూ అంట! ఏమంటారు?'

ఆయన ఒక్క క్షణంఆగి సమాధానంకోసం అతని వంక చూచారు. కాస్త ఆపేక్షగా, ఆశగా చూచారు. ఇంతవరదాకా. ఎవరా ఈవ్యక్తి ఇంతచనువుగా మాటాడుతున్నాడని ఆశ్చర్యపడుతూ కూర్చు న్నాడు మోహన్.

మోహను కాస్త వెనకాముందూ ఆలోచించుకోవడానికే సావకాశం చిక్కలేదు, గత అర్ధగంటనుంచీ. ఆయన మోహనుగదిలోకి ప్రవేశిస్తూనే తల్లిదండ్రుల యోగక్షేమాలను విచారించారు. కుర్చీలో కూర్చుంటూనే "బాబు నాయనా నువ్వు చిన్నప్పుడుగానీ మీ పెదనాయనగార్ని, వాళ్లనూ బాగా ఎరుగుదును. యోగ్యతఅన్నా సత్సంప్రదాయమన్నా వారిదే. మీ తాతగారి కాలంనుంచీకూడా అంతే. వీళ్ళు ఆయన పేరు నిలిపారు. అన్నట్టు మరచాను మీరెంతమంది అన్నదమ్ములూ?" అంటూ పరామర్శ మొదలుపెట్టారు. అతను సమాధానం చెప్పకముందే ఆయనే అందుకొని "అవునవును... మీరు రెండోవారు కదూ. ఏమిటో వయస్సు మళ్లిన కొద్దీ జ్ఞాపకశక్తి తగ్గిపోతున్నది. అదీగాక చూడండీ రాకపోకలు లేక పోతే దగ్గర బంధుత్వాలనే మరచిపోతాము. అలాంటిది స్నేహాలు ఎన్నా ళ్ళుంటాయి......" ఆయన అలాచెప్పుకు పోతున్నప్పుడు మోహను ఆయనకూ తన కుటుంబానికీ స్నేహం ఉండివుంటుందనీ, అది తనకు తెలియదనీ అనుకున్నాడు. అందువల్ల వీథిలోకి వెళదామని ప్రయాణమ యిన వాడు ఆయన కెదురుగా కుర్చీలో కూర్చుని ఆయన చెప్పేమాటలు తాపీగా వినడానికి సిద్ధమయాడు.

ఆయన ఆ కాస్త అవకాశం వినియోగించుకుని అంతసేపూ మాటాడాడు. కుశల ప్రశ్నాదికాలయిన తర్వాత నెమ్మదిగా పెండ్లివిషయం ప్రస్తావించాడు. పిల్లవిషయం వివరంగా చెప్పాడు. అంతసేపూ తానే మాటాడాడు.

అప్పటికి కాస్త అలుపు వచ్చింది. అందుకే అన్నట్లు సంప్రదాయాన్ని గురించి ప్రశ్న వేశాడు.

"కాదుటండీ మరి! అందులో మనదేశంలో !" అన్నాడు మోహన్ —ఆ ప్రశ్న తన్ను ఉద్దేశించిందేనని నిర్ధారణకు వచ్చాక. ఓ క్షణం ఆలస్యంగా అన్నా అతనామాట కాస్త హుందాగా, స్పష్టంగా అనడంచేత ఆయన సంతోషించి, మరింత ఉత్సాహంతో మళ్ళీ అందుకొన్నాడు. "మంచిమాట అన్నారు. ఈనాడు జనం మరీ ఇలా విరగబడి పోతున్నారుగానీ పూర్వం ఎంత ఆచారం పాటించేవారు. మంచి సంప్రదాయాన్ని ఎంతగా గౌరవించేవారూ! ఇంకా ఆ పాతకాలపు కుటుంబాలు ఒకటి రెండైనా ఉన్నాయి గనుకనే మాబోటివాళ్ళం కొంత సంతృప్తి చెందగల్గుతున్నాం. ఇంతకూ చెప్పవచ్చిందేమంటే మంచి సంప్రదాయం గల కుటుంబంలోని పిల్లవాడు దొరక్కనే గత మూడేళ్ళనుంచీ తిరుగుతున్నాను. సరే ఇంతకూ...అని కాసేపు నిశ్శబ్దమిలి, అసలు విషయంలోకి వస్తూ "ఇంతకూ మీ రావిషయం ఏమీఅననేలేదు" అన్నాడు.

"నేను చెప్పేదేముంది పెద్దవాళ్ళున్నారుగదా" అని మోహన్ అనీ అనకముందే ఆయన అందుకొని, "సరిగ్గా అనవలసిన మాట అన్నావు. అలా అంటావని నాకు తెలుసు. అయితే చూచావా కొంతమంది అంతా విని ఇప్పట్లో పెళ్ళి చేసుకోవాలని లేదండీ అంటారు. అదీ విన్నాను. అతనామాట అన్నాక ఇంక ఇంటికి వెళ్ళినా లాభం ఉండదు. ముందుగా వాళ్ళ యింటికి వెళితే "అబ్బాయి ఉద్దేశం ఎల్లా ఉన్నదో కనుక్కోలేదండీ అంటాడా పెద్దమనిషి. సరే ఏమైనా కొంత కాలాన్నిబట్టి పోవాలిగదా! మిగతా విషయాలు మేం పెద్దవాళ్లం చూచుకుంటాం. ముందుమీరు పిల్లను చూడండి. పిల్లను పిల్లవాడూ పిల్లది, పిల్లవాణ్ణి చూచుకోవడం ఒక రివాజు అయిందిగా ఈ రోజుల్లో.... మంచిదే. అలానే చేయండి" అన్నాడాయన.

"అట్బే—అందుకయినా ముందు మా వాళ్ళతో మాట్లాడిరండి." అన్నాడు మోహను.

"మాంచి భేషైన మాట అన్నావయ్యా. జరగవలసిన పనే అది. అందరూ కలిసివస్తే ఒక్కమాటే అంతా పిల్లను చూసినట్లవుతుంది. ఆ తరువాత విషయాలు అక్కడే మాట్లాడేసుకోవచ్చును. ఇరువురికీ సుళువైనపని. అవునదే బాగుంటుది. లేకపోతే ముందు కుర్రవాడు వచ్చి చూడడం, చూచాక, ఏమయ్యా అంటే మావాళ్ళు చూడాలండీ అనడం వాళ్ళు ఒక్కొక్కళ్ళే, రావడం వెళ్ళడం. ఇదంతా కాలయాపనాన్నూ, అనవసరమూన్నూ. అయితేచూడు నాయనా ఇక్కడేదైనా బావీ అదీ ఉన్నదీ?"

"బావి లేకపోవడమేమండీ ఉన్నది. ఏం ఎందుకండీ స్నానం చేస్తారా?" అని అడిగాడు మోహను ఆశ్చర్యపడుతూ.

"అవును మరి చెయ్యద్దూ? సంధ్యవేళ కావస్తుందే?" అన్నా రాయన ఏదో మరచిపోయిన విషయం అతనికి జ్ఞాపకం చేస్తున్నట్టు.

"అయితే అల్లాగే వెద్దురుగాని లేవండి" అని మోహన్ తువ్వాళ్ళు అందించాడు. ఆయన వాటిని అందుకొని చెంపరా మెల్లమెట్లపుట వెళుతూ మధ్యలో ఓసారి వెనక్కు తిరిగి "చూడు నాయనా ఇవ్వాళ ఇక్కడే సంధ్య వార్చుకొంటాను" అన్నాడు.

మోహనుకు వెంటనే అర్థం స్ఫురించలేదు. "అల్లాగేనండీ. దానికేం భాగ్యం, అంటూ అతను ఆయనవెంటకొంతదూరం వెళ్ళి, బావికి దారి చూపించి, తిరిగి గదిలోకి వచ్చాడు నవ్వుకొంటూ. కుర్చీలో కూర్చుని "అవును, వార్చుకోనీ. ఇందులో నాకేం అభ్యంతరం ఉంటుందీ ఓమూల కూర్చుని సంధ్య వార్చుకొని వెళ్ళడానికి నాకు చెప్పడం దేనికీ? ఒట్టి

చాదస్తుడిలా ఉన్నాడీయన" అనుకొన్నాడు మోహన్. అంతలో విషయం స్ఫురణకు వచ్చింది. 'అబ్బే ఆయనేం ఛాందసుడు కాదు. 'అనుకొని మొత్తంమీద చిక్కే తెచ్చిపెట్టాడే ! ఏంచెయ్యటం ఇప్పుడు ?' అని వితర్కించుకొంటూ క్రిందకు వెళ్ళాడు.

ఈయన్ను కనుక హోటలుకు తీసుకొని వెళితే మిత్రులంతా చూస్తారు. మడికట్టుకొని విడిగా కూర్చుని భోజనం చేస్తానంటాడు. ఎవర్రా ఈ ఛాందసుడని నలుగురూ అడక్క మానరు. అసలు వాళ్ళు అడక్క ముందే విషయమంతా అందరితోనూ చెప్పేసేలాగున్నాడు'. ఇల్లాఅనుకొంటూ అతను క్రింద మెట్టుదగ్గరకు వచ్చాడు. అక్కడ ఆగి ఈ గొడవంతా ఎందుకూ పిన్నిగారితో బంధువని చెప్పేస్తే సరిపో తుంది అనుకొంటూ మెట్లుఉన్న సందులోనుంచి వెనకవైపుకువెళ్ళి "ఏమండీ పిన్నిగారూ'' అనిపిలిచాడు నెమ్మదిగా. ఆయనకు భోజనం ఏర్పాటు చూడమని చెప్పాడు. ఎవరాయన అని ఆవిడ అడిగిన ప్రశ్నకు వెంటనే సమాధానం చెప్పక హోటల్లో కలిగే ఇబ్బందుల్ని గురించి చెప్పి, "ఆయనకు మరీ మడీ ఆచారమున్నూ, మా కాయన వేలివిడిచిన పెద్ద మేన మామకు పెద్ద తండ్రి కొడుకు అవుతాడు లెండి'' అని తనకూ తెలియని బంధుత్వం కలుపుకోవాలని ప్రయత్నం చేశాడు. కాని ప్రయత్నపూర్వ కంగా చెప్పినట్లుగానే ఉన్నదా సమాధానం అతను ముఖం ఎంత అమాయికంగా పెట్టినా. ఆమె మొదట నవ్వుఆపుకొన్నది.

"అయితే మోహన్ మీ చినమేనమామ కేమవుతాడయ్యా'' అని పకాలున నవ్వేసింది. తన తెలివితక్కువతనాన్ని అంగీకరించేస్తున్నట్లు అతనూ నవ్వేశాడు.

"సరే పోనీ ఎవరైతే ఏంగాని రమ్మను.'' అని ఓ క్షణమాగి కాస్త అనునయంగా ఇంతకూ ఆయన ఏంపనిమీద వచ్చాడో చెప్ప కూడదుటయ్యా?" అని అడిగింది అతను ఏదో దాస్తున్నాడని పసిగట్టి.

"పెద్దపనేం కాదులెండి...సంబంధం వెతకడానికి వచ్చాడట" అన్నాడు మోహన్ చెప్పక తప్పదనుకొని.

"ఇంకేం వెదకబోయిన తీగె...మరి చెప్పవూ. అంతలో దాస్తావెందుకయ్యా? ఆ మాట చెప్పడానికే సిగ్గు పడుతున్నావా? అవునా?''అని నవ్వుతూ నిలవేసింది.

"అచ్చే లేదండీ.''

అతనీసారి నిజంగానే సిగ్గుపడ్డాడు.

అది గమనించి "చిన్నవయస్సులో సిగ్గు అన్నది మొగపిల్లల్లో కూడా ఎంత శోభిస్తుందో!'' అనుకొన్నదావిడ.

"అవున్లే ఇరవై యేళ్ళు వచ్చేదాకా పెళ్లిళ్లు కాని పోయ్యేసరికి ఈ రోజుల్లో ఆడపిల్లలు సిగ్గుపడడం మానేస్తున్నారు. అందుకని ఆ పని మనమైనా చేద్దామని మొగపిల్లలు నేర్చుకొంటున్నట్లున్నారు. అవునా?" అంటూ ఆవిడ లోపలకు వెళ్ళింది.

ఆయన అంతలో స్నానం పూర్తిచేసుకొని "ఇటు రావచ్చు కదమ్మా'' అంటూ చాలా పరిచయమున్న ఇంట్లోకి వచ్చినట్లుగా పెద్దపెద్ద అంగలువేస్తూ వంట ఇంట్లోకి వచ్చాడు. "అబ్బాయి ఇప్పుడే చెప్పాడు. మీరూ అతనికి బంధువులేటగా'' అంటూ గోడకానించిఉన్న పెద్ద పీటవేసుకొని కూర్చుని చెంబుతో మంచి నీళ్ళు ఉద్ధరిణా తెప్పించుకొని సంధ్య మొదలు పెట్టాడు.

ఆవిడ త్వరత్వరగా వంటపనులు పూర్తిచేసింది. దేవతార్చన మందిరం ప్రక్కగా పెద్దపీటవేసి, మంచి అరిటాకువేసి, ఆవిడ ఆ ముస లాయన్ను భోజనానికి పిలిచింది.విస్తట్లో అన్నీ వడ్డించి నెయ్యీ, పులుసూ,

మజ్జిగా కూడా అభిఘరించాక ఆయన పరిషేచనం చేసి భోజనానికి ఉపక్రమించాడు. "వారుకూడా ఉంటే బాగుండేది. యజమాని సహపంక్తిని లేకుండానే భోజనం చెయ్యవలసివచ్చిందే'' అంటూ ఆయన ఎంతో నొచ్చుకొన్నాడు. "క్యాంపునుండి ఇవ్వాళో రేపో వస్తారు మరి మీరు వస్తారని మాకు తెలియదుకదా" అని అంటూ ఆవిడ పప్పూ నెయ్యీ మారడిగింది. అవీ ఇవీ మాట్లాడుతూ మోహన్ను గురించి మంచిమాటలన్నది. "ఏంకావాలండీ'' అని అడిగి వేసుకొమ్మంటూ "అతనూ వాళ్ళూ ఒప్పుకొంటే అంతకన్నా మీరు కాదు మరొకరు మాత్రం కోరదగిందేముంటుందండీ" అని వడ్డించి అడిగింది. ఆయన సమాధానం చెప్పే అవకాశం ఇవ్వకుండా "ఒకతైన పిల్ల మా అన్నగారి దగ్గరో తమ్ముడు దగ్గరో ఉంటే ఈ సంబంధం మీదాకా రానిచ్చేదాన్నా! అయితే మమ్మల్ని మీ సంప్రదాయాన్నీ చూశాక మంచిసంబంధం వచ్చిందని నాకూ సంబరంగానే ఉన్నది" అంటూ గోత్రాదికాలు అడిగి తెలుసుకొన్నది.

"మరింకేమండీ అన్నీ అనుకూలంగా ఉన్నాయి. మావాడని చెప్పడంకాదు పిల్లవాడు బుద్ధిమంతుడు. ఆస్తిపాస్తులు మీరు విచారించుకొన్నదేకదా. అంచక్కా చదువుకొంటున్నాడు, ఇంతకంటే మీరుమాత్రం పెద్ద సంబంధం తేగలరా చెప్పండి బాబాయిగారూ?" అన్నదావిడ.

ఆయన ఆ మాటలన్నీ సంతోషంగా విన్నాడు.

"అవునమ్మా అవును. నీవన్నమాట అక్షరాలా నిజం. నిజానికి నేను ఎన్ని సంబంధాలు చూచానో ఎన్నివిధాలతిప్పలు పడుతున్నానో ఎవరికి తెలుస్తుంది. తిరగలేక కాస్త బద్ధకిస్తే నాయింటిది క్షణం ఊరుకొంటుందా!" అన్నాడాయన.

"ఇంకెందుకూ. మీ కష్టాలన్నీ గట్టెక్కాయనుకోండి. మీరింక నిశ్చింతగా ఉండండి" అంటూ పులుసు వడ్డించింది ఆవిడ.

పులుసులో కొంచెం పంచదార అడిగి వేయించుకొన్నాడాయన. అది ఆప్యాయంగా సగంతిని, మిగతా సగం అవతలగా నెట్టి అట్టేపెట్టుకొని, దాన్ని పెరుగు అన్నంలో మధ్య మధ్య తిన్నాడాయన. పెరుగు అన్నం తింటూన్నప్పుడు చూచి ఆయింటావిడ 'ఈయనకు ఛాదస్తం ఉపాలు ఎక్కువే సుమా' అనుకొన్నది. అలా అనుకొంటూ కాస్త పరీక్షగా చూచింది ఆయనవంక. ఎందుకో ఆయన వ్రేళ్ళు వణుకుతున్నాయి. ఒకసారి వెంట వెంటనే, మరోసారి ఏదోపరాకుగా, ముద్దలు నోట్లోపెట్టుకొంటున్నాడు. అల్లా కాసేపు దిక్కులుచూస్తూ కూర్చుని, నోట్లోఉన్న ముద్ద గుటుక్కున మ్రింగి, గబగబా ఉన్న కాస్త అన్నమూ కుక్కేసుకొని, విస్తరిచుట్టూ నీళ్ళుత్రిప్పి ఒక్కవిసురున లేచి దొడ్డి గుమ్మం దగ్గరకు వెళ్ళాడాయన.

ఆవిడ నిర్ఘాంతపోయి అలాచూస్తూ ఉండిపోయింది. ఏమనడానికీ ఆవిడకు తోచకపోయింది. ఒకవేళ ఏదైనా వికారపెట్టిందేమోనని అనిపించి వెంటనే లోపలకువెళ్ళి రెండువక్కలు తెచ్చి పీటమీద పెట్టి "వక్కలు పీటమీద ఉంచాను వేసుకోండి'' అని అంటే ఆయన అట్టే వద్దమ్మా నా కలవాటు లేదని చెబుతూ చేతులూ, ముఖమూ భుజం మీద ఉన్న తడి కొల్లాయితో తుడుచుకొని కాళ్ళు అద్దుకొని "అమ్మాయ్ వసారాలో ఓ చాపవెయ్యమ్మా! కాస్త నడుంవాలుస్తాను" అన్నాడు.

ఆవిడ చావడిలో చాపవేసి జంపకానా పరచి, దిండుకూడా, ఇచ్చి "ఇక్కడ పడుకోండి. వసారాలో అయితే ఎవరో ఒకరు వస్తుంటారు." అని చెప్పి వెళ్ళింది. ఆయన చాలాసేపు మౌనంగా ఇంటి కప్పుకేసి అతిదీక్షగా చూస్తూ, ప్రక్కగదిలో పిల్లలు - అల్లరి

చేస్తున్నా. తప్పుల్తో సుమతీ శతకంలోని పద్యాలు పెద్దగా చదువుతున్నా. ఏమీ పట్టనట్టు నిద్ర పోయాడు. పైగా గుఱ్ఱుపెట్టాడు కూడానూ. మోహన్ మంచిగుడ్డలు వేసుకొని మామూలుకంటె కొంచెం ఎక్కువగా ముస్తాబై పుస్తకాలు పుచ్చుకొని రెండోపూట కళాశాల తరగతులకు అందుకొందామని వెళుతూ, ఆవిడనోసారి పల్కరించి పోదామని లోపలకు వచ్చాడు.

ఆవిడ తానే ముందుగా మాటాడుతూ "ఆయన నిద్రపోతున్నారు —కాబోయే అల్లుడిగారి ముస్తాబంతా చూడకుండా అవునా?'' అని నవ్వింది. "పోన్లెండి ఏం ఎగతాళిచెస్తారు గానీండి. ఎందుకంత ఎక్కువ పెట్టేశారు. పెరుగూ అదీ ఎక్కువయి నట్లుంది. అందుకేనా అంతవేగం నిద్రపోతున్నారు' అన్నాడు మోహన్.

"అప్పుడే కాబోయే మామగారిపై పరిహాసాలా! సరే సాయంత్రం కాస్త పెందరాళే వచ్చేస్తావు కదూ" అన్నదావిడ. "అలాగే నండీ" అంటూ తలఊపుతూ ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ వెళ్ళిపోయాడు మోహన్.

'పెళ్ళి అనేసరికి ఎవరికైనా సరదాగానే ఉంటుంది. ఏమీ పట్టనట్లు తిరిగే ఈ పిల్లవాడికికూడా పెండ్లి సంబంధం వచ్చే సరికి ఎంత కప్పిపుచ్చుకున్నా ఎంత సంతోషం కినపడిందో ముఖంలో! అంతే మరి!' అనుకొన్నదావిడ. ఆవిడ మరో మాటకూడా అనుకొన్నది. 'అవును ఇల్లానే ఉండాలి సరదా అన్నా సంతోషమన్నానూ. కాని ఈ రోజుల్లో కుర్రవాడు–ఎవరైనో ఏ రోడ్డుమీదనో, కాక ఏ పార్కులోనో చూస్తాట్ట. అపళంగా అతనికీ ఆ పిల్లకూ ప్రేమట. ఇక షికార్లకూ, సినిమాలకూ వేగించుకు పోవడం. ఏమిటో సంబంధం; విడ్డూరాలూ వెట్టివేషాలున్నూ! అందుకే అవన్నీ ఎంత ఎబ్బెట్టుగా ఉంటాయో!'' అని.

మోహన్‌మీద అంతకు ముందు నుంచీ ఆమెకు ఉంటూ వచ్చిన గౌరవం ద్విగుణీకృతమైంది. ఆదరణా ఆపేక్షా మొగ్గ తొడిగాయి.

* * *

మధ్యాహ్నం ఆయన నిద్ర లేవంగానే కాఫీకి నీళ్ళుపెట్టి ఫలహారం చేసింది. పీటవేసి పెద్ద వెండి కంచంలో అవి వడ్డించి "రండి బాబాయి గారూ రెండు బజ్జీలు చేశాను'' అని గౌరవంగా పిల్చింది.సొంత వియ్యాలవారికి చేసినట్లుగా మర్యాద చేసింది. ఆయన ముఖం కడుక్కొనివచ్చి చాలా స్వల్పంగా తిన్నాడు. తిని లేవబోతుంటే ఉండండని కాఫీ కలుపుకొనివచ్చి ఇచ్చింది, ఆవిడ.

"కాఫీ త్రాక్కపోవడమేమిటండీ. తప్పదు బాబాయిగారూ తాగాల్సిందే. పోనీ మీకోసం కాకపోయినా కాబోయే అల్లుడికోసమైనా తాగాలి. మంత్రనికి కాఫీలేందే పూట గడవదు. కాఫీ త్రాగని మామగారు నాకు అక్కర్లేదని అనేయగలడు కూడానూ'' అని నవ్వుతూ ఎంతో బలవంతపెట్టిందిఆవిడ.

"బాగానే ఉందమ్మా నీ బలవంతం! అయితే తెలియకడుగుతానూ కట్నాలూ కానుకలతో రత్న శలాకవంటి పిల్లనిచ్చి కాళ్ళు కడగడమే కాకుండా క్రొత్త అలవాట్లుకూడా చేసుకోవాలటమ్మా? ఊఁ సరే అందులో సగం ఇవ్వు'' అన్నాడాయన. తానుకూడా నవ్వుతూ మరో గ్లాసులో అలా సగమే సర్ది ఇస్తే, ఆయన గ్లాసు ఎత్తి పట్టుకొని మంచితీర్థం నోట్లో పోసుకొన్నట్లు పోసుకొని గటగట త్రాగేశాడు.

"పాప పరిహారార్థం'' అనుకొంటూ బొడ్డోనుంచి తీసిన పొట్లంలోనుంచి చిటికెడు విభూతి నోట్లో వేసుకొని మింగాడాయన. అదిచూచి ఈవిడ వెనకాల నిల్చొన్న పదేళ్ళ పెద్దపిల్ల పెద్దగా నవ్వేసింది. ఆమె ఆ పిల్లను కేకలు వేయడానికిబదులు తనకూ నవ్వాగక పక్కన నవ్వే

సింది. పైపెచ్చు "అదేమండీ—అంత పూర్వకాలపు మనుష్యుల్లా కన్పించారంటే మా మోహన్ అసలు చూట్టానికే రానంటాడేమో సుమండీ'' అన్నది. ఆ మాటకాయన అందుకొని "చూడమ్మాయ్ ఒకటి అడగనా. ఇప్పుడు ఆయనగారు చూడవలసిందీ చేసుకోవలసిందీ నన్నా మా అమ్మాయినా ?'' అని లోపల సంతోషిస్తూ పైకి నవ్వాడు. ఆ ముసలాయన ఆ నవ్వులో సంతోషాతిరేకాన్ని ప్రకటించాడు.

"అవుననుకోండి. కాని ఫలానావారు మామగారు అని అతను చెప్పుకోవాలిగదా. అందుకు మీరు కాస్త నవీనంగా కన్పించనక్కర్లేదా అంట!'' అన్నదావిడ.

"ఏం నవీనమమ్మా...అల్లా అంటున్నారనే మా అమ్మాయికూడా ఫేషన్లు నేర్చింది. కాళ్ళకు చెప్పులూ వేస్తున్నది. చేతులకు పట్టిగాజులూ తొడుక్కొన్నది'' అని ఎంతో ఆశ్చర్యకరమైన విషయం చెబుతున్నట్లు ఆమెవంక చూచాడు.

"అవి చాలవండీ. చేతికి రిస్టువాచీ, కళ్ళకుజోడూ కూడా ఉంటేగాని మాకు నచ్చదు'' అన్నదావిడ చీరకొంగు నడుంచుట్టూ త్రిప్పి బొడ్డునదోపుకుంటూ.

"ఆహా బాగుందమ్మోయ్...ఇంకా నయం గిరజాల జుట్టుకూడ పెట్టుకోమన్నావ్ కాదు'' అని ఆగి చప్పున లేచినిలబడి "ఒక వేళ అన్నీ అనుకూలించి అబ్బాయి చేసుకొంటే...దానికీ అతనికీ ఇష్టమయితే ఎన్ని ఫేషన్లయినా చేసుకొంటుంది. కాని ఆ గిరజాలజుట్టు మాత్రం పెట్టుకోదు. బొందిలో ప్రాణముండగా జుట్టుముట్టుకోనిస్తుందా' ఆయన ఆమాట అని, ఎటోచూస్తూ కొంతసేపు మౌనంగా, పరాకుగా ఉండిపోయాడు. అంతలో చప్పున ముఖం మరోవైపుకు త్రిప్పుకొన్నాడు

గబగబా నాలుగడుగులు ముందుకువేసి అక్కడ కాసేపు ఆగి, వెనక్కి తిరిగి "ఆపనిమాత్రం చెయ్యదు'' అని స్పష్టంగా చెప్పేసి, గుమ్మం దాకా వెళ్ళి "చూడమ్మాయి...అన్నట్లు మరచాను నీ పేరేమిటో తెలుసుకొన్నానుగాదు" అన్నాడాయన.

"హైమవతండీ" అన్నదావిడ.

"చూడమ్మా, హైమవతీ, ఇకపైని భారమంతా నీపైన మోపి వెళుతున్నా" అని కొల్లాయిగుడ్డ దులిపి పైన వేసుకొని ఆమెవంక "ఏమంటావ్'' అన్నట్లు చూచాడు. ఆ చూపులో జాలికూడా కన్పించింది.

అది గమనించి ఆవిడ "అదేమిటండీ అలా వూరికేఇదవుతారూ ఏదో నవ్వులాటకు అనుకొన్న మాటల మీద పెరిగి ఆ మాట వచ్చింది. అయినా మీదంతా విచిత్రంకాని బాబాయిగారూ! ఎంత నవ్వులయితే మాత్రం మనలో ఈడొచ్చిన పిల్లకు షోకుకోసమై గిరజాలు పెట్టిస్తారా? అస లింతకూ ఉన్న విషయం చెప్పవలసివస్తే మా మోహానుకు మరీ ఫేషనుగా ఉండే పిల్లలంటే గిట్టదు. పైగా వెక్కిరిస్తాడు కూడానూ'' అని అంటూ ఆయనకు ధైర్యం చెప్పింది.

"అల్లాగాఅమ్మా, మీవాడు అంతబుద్ధిమంతుడా తల్లీ. నేనూ అతన్ని చూడగానే అలానే అనుకొన్నాను. సరయితే శుభం అను నేను సంతోషంగా వెళ్ళి వస్తాను" అన్నాడాయన మెట్లు దిగుతూ. వసారా చివరగా నిల్చుని ఆవిడ "శుభమ్, క్షేమంగా వెళ్ళిరండి. తర్వాత వ్యాపహారం కాస్తవేగం నడిపించండి'' అన్నది.

"అల్లాగేనమ్మాఅలాగే'' అంటూ ఆయన వీధిలోకి వెళ్ళాడు. కొంత దూరం వెళ్ళేదాకా మధ్యమధ్య వెనక్కితిరిగి చూచి ఏదో అమూల్య

మైన వస్తువును పారవేసుకొన్న వాడిలా ఆత్రంగా చూచాడు. ఆతర్వాత చకచకా నడుస్తూ రెండుమూడు నిమిషాలో కనుచూపుమేర దాటి వెళ్ళి పోయాడు. సందు మలుపు తిరిగేదాకా ఆవిడ అక్కడే నిల్చుని, ఆయన్ను గురించేఆలోచిస్తూ ఉండి. పిల్లల కేకలువిని లోపలకు వెళ్ళింది. హైమవతమ్మ పిల్లలకు నీళ్లుపోస్తూకూడా ఆ ముసలాయన విషయమే ఆలోచించింది. ఆయన ప్రవర్తనలో ఏదో అసాధారణత్వం కన్పించింది. ఆవిడ పొయ్యిరాజేసి,ఎసరు పడేసి, ముందుగదిలోకి వచ్చి, పెద్ద పిల్లకు జడ అల్లుతుండగా ఆయన మళ్లావచ్చారు. ఇదేమిటి వెళ్లి ఓ గంట అయినా కాలేదు మళ్లా వచ్చా రేమిటబ్బా అనుకొంటూ వసారా లోకి వచ్చిందావిడ. ఆయన రిక్షావాడిచేత ఒక పెద్ద పళ్లబుట్ట చావడిలో పెట్టించి, అక్కడ కుర్చీలో కాళ్లు పైన పెట్టుకొని కూర్చున్నాడు. "అమ్మాయి! చిల్లర ఉంటే వాణ్ణి పంపించేయ్'' అన్నా డాయన ఏటో చూస్తూ. రిక్షావాణ్ణి పంపించి ఆవిడ లోపలకు వచ్చాక "చూడమ్మాయ్ ఏదైనా మంచి పళ్ళెంపట్రా అని, ఎందుకంటే అంటూనే ఆవిడ వెండిపళ్ళెం తెచ్చిఇస్తే, ఆ పళ్లెంనిండా పళ్లూ తమలపాకులూ, వస్త్రాలూ పెట్టి తీసుకోమన్నాడాయన. ఆవిడ కేమీ అర్థం కాలేదు. పెండ్లికొడుకూ అతని తరఫువాళ్లూ పిల్లను చూడ్డానికి వెళ్లితే జరగవలసిన లాంఛనం ఇది. అది ఆయన చెయ్యడమేమా అని ఆశ్చర్యపడ్డది. పైగా ఆయన తానేమీ అనకముందే "పుచ్చుకో అమ్మా కాదనకు. నాకు చాలా కష్టంగా ఉంటుంది. అని అంటుంటే ఆమె కేమీ పాలుపోలేదు.

మాటాడకుండా తీసుకొన్నది ఆవిడ.

ఏంమాట్లాడాలో తెలియక "అదేమండీ ఒళ్ళో ఏదో దాచుకొని కూర్చున్నా రేమిటి?'' అని అడిగింది. ఆయన వెంటనే ఒళ్ళోంచి పెద్ద ఫోటో ఒకటి తీసి ఆమె చేతికి అందిస్తూ "అమ్మాయి ఫోటో ఒకటి

కప్పిస్తే వెంటనే మీ కిచ్చిపోదామనిపించి వచ్చానమ్మా. ఒట్టి చేతులతో ఎల్లారానూ అందుకని ఏవో నాలుగుపళ్లు తెచ్చాను.'' అన్నాడాయన.

ఆమె ఆ ఫోటో అందుకొని పైన ఉన్న ఉల్పిరి కాగితం తొలగించి చూచింది. చూచి ఒక్కసారి చకిత అయింది. మోహనుకు ఇంత చక్కని చుక్క భార్యగా దక్కబోతున్నదిగదా అనీ, అంత అందమైన పిల్లను, నాలుగువేలు కట్నంతో కోడలుగా కుదిరించి పెట్టినందుకు మోహను తలితండ్రులు తన్ను ఎంతో మెచ్చుకొంటారనీ ఆమె ఎంతో సంబరపడ్డది. "చూడమ్మాయ్ పిల్ల విషయంలో నువ్వుగానీ, అబ్బాయి గానీ ఎటువంటి అనుమానాలు పెట్టుకోకండి. మరోటి, ఆ నగ లన్నీ దానివే.'' అని మరో క్షణమాగి "అవేకాదు నా ముసలిదానికి నగ లెందుకూ అవీ ఇచ్చేస్తుంది'' అన్నాడాయన.

అంతలో పళ్ళే అందుకొని "చూడమ్మాయ్ ముందు నువ్వు ఓ పనిచెయ్యి. పిల్లవాణ్ణి వెంటపెట్టుకొని యింటికి వచ్చి పిల్లనుచూడు. అతనికి పిల్ల నచ్చితే'' అని అంటుంటే "మిగతా విషయాలు నేనుచూస్తా. అసలు నచ్చకపోవడం అంటూ జరగదుగా'' అన్న దావిడ తన సంతోషం వ్యక్తపరుస్తూ.

మోహన్ ఆ రోజుసాయంకాలం పెందరాళే ఇంటికి రావాలని కొంత ప్రయత్నం చేశాడు, కాని అది సాగలేదు. కళాశాలలో ఒక వాగ్వివాద పోటీసభ ఉండి అక్కణ్ణించి తెమల్చుకొని రాలేకపోయాడు. కళాశాలకు వెళ్ళినప్పటినుంచీ ఇంటికి వచ్చేయాలనే అనిపిస్తూ వచ్చింది. గదిలో కూర్చొని, తన పెళ్ళి విషయమై ఆలోచించుకొంటూ కాలం విశ్రాంతిగా గడపాలని అనిపించిం దతనికి. ఆ పగలంతా అతనాలో చిస్తూనే ఉన్నాడు.

'ఈ పిల్ల విషయంలో అందచందాదుల్లో, సంప్రదాయాదుల్లో కాకపోయినా ఎక్కడో ఏదో ఒక చిన్నలోపం ఉండిఉండాలి. కాకపోతే ఈ ముసలాయన అల్లాగా తిరగవలసిన పని ఉండదుగదా! బహుశః కట్నం అదీ తను అంటున్నంత నిజంగా ఇవ్వలేదేమో! పైకి అల్లాగని అన్నా తీరావెళ్ళి పిల్ల నచ్చిందన్నాక నీళ్ళునమిలే బాపతు అయిఉండవచ్చు. కాదు ఆ పిల్లకు చదువు సంధ్యలు లేవని అతి నవ్యులయిన తోటివరుళ్ళు వెనకాడుతున్నారేమో అని అనుకొంటూ మొదట శంకించాడు. కాసేపు తర్కంలో పడ్డాడు.

తన అనుమానాలు నిర్హేతుకమైనవని కొంతసేపు తర్వాత నిష్కర్షగా అనిపించింది అతనికి.

ఇంక పూర్వంలా కాదు.

అమ్మా వాళ్ళో, అక్కయ్యావాళ్ళో తన పెండ్లి ప్రస్తావన తెచ్చి నప్పుడు—"ఇప్పుడప్పుడే చేసుకోను" అని నిక్కచ్చిగా గానీ, "మీ యిష్టం నాకుతెలియదు" అనిముఖావంగాగానీ సమాధానాలు చెప్పగూడదు. అంత భయందేనికీ? పిన్నిగారిచేత ముందుగా ఈ సంబంధం వివరాలు వ్రాయించి నాకు పిల్లనచ్చిందనికూడా ఒకముక్క కలపవచ్చు. అల్లా చేస్తాను' అల్లాగా అనుకొని అతనొక దృఢ నిశ్చయానికి వచ్చాడు. అతని కానిశ్చయం మనస్సులో నిలిచాక ఎంతో ఉత్సాహం కలిగింది. మంచి ధైర్యం వచ్చింది.

అందువల్లనే అతను తన కళాశాలలో చదువుకొంటున్న ఆడ పిల్లలవంక కాస్త ధైర్యంగా నిదానంగా చూచాడు. చూచి పైపై నాజూ కులను సరిగానే పోల్చుకొని అచ్చమయిన సౌందర్యాన్ని చక్కగానే ఊహ చేశాడు.

"ఆపిల్లఇలా-ఇల్లాగా సన్నగా అనారోగ్యంగా ఉండి ఉంకడు.అల్లాగా గిటకబారినట్లుగా ఉండదు. ఎత్తు మడమల స్లిప్పర్లు వేసుకొని అల్లా తూలుతూ నడవదా పిల్ల." అని ప్రతి పిల్లనూ చూచి వంకలెన్నుతూ తన కొంటెతనానికి అంతలో తానే నొచ్చుకొంటూ, ఏమైనా తను చూడ బోయే వధువు వాళ్లలా ఉండదని, ఉండడానికి వీల్లేదని అనుకొన్నాడు. "అవును. వీళ్ళు మా మగపిల్లల్లాగా చదువు సంధ్యల్లో పడి నలుగుతూ, హాస్టలు భోజనాలు చేస్తూ కాలం గడుపుతున్నారయ్యే. ఆ పిల్ల యేమో ఇంటిపట్టున నీడలో పెరిగినదయ్యె. తేడా ఉండదూ?" అని తనకు తాను సమాధాన పరచుకొన్నాడు.

అతడు సాయంత్రం ఇంటికి తిరిగివచ్చేసరికి అతని మనస్సులో వధువు మనోహరమైన ఆకారం రూపు కట్టింది. ఇల్లాగా రూపు కట్టిన మనోహరాకారాన్నే మరల మరల తలచుకొంటూ మోహన్ విలాసంగా చేతులూపుతూ, పైగా సన్నగా ఈల వేస్తూ, మేడపైకి వెళ్ళ బోతుంటే చూచి హైమవతమ్మగారు సందు గుమ్మంలో నిలబడి "ఇల్లా రావయ్యా ఒకసారి" అని పిలిచింది. అతను అటూ ఇటో చూడడం గమనించి "ఆయన మధ్యాహ్నం కాసేపు పడుకొని నాలుగ్గంటలకు వెళ్లాడు. అయిదు గంటలకు మళ్ళీ వచ్చి పళ్లూ అవీ ఇచ్చి వెళ్ళాడు. నీకూ-బోయే మామగారి సొమ్ము అంతా నేనే పుచ్చేసుకోవడం ఏంబాగుంటుందీ" అని అంటూ లోపలకు వెళ్లింది. ఓ చిన్న వెండి పళ్లెంలో రెండు బజ్జీలు పెట్టి తెచ్చి అతని కందించింది. మంచినీళ్లు పిల్లను తెమ్మని తాను కొన్ని చక్రకేళీలూ, రెండు బత్తాయిపళ్ళూ పట్టుకొని వచ్చింది.

"ఓ క్షణం కూర్చో కాఫీ తెచ్చి ఇస్తాను." అని ఆయన మధ్యాహ్నం కాఫీ త్రాగడంలోని విశేషాలు చెబుతూ అతనికి కాఫీగ్లాసు అందించింది. మోహన్ "అబ్బే ఎందుకండీ ఇప్పుడే ఒక అర్ధగంట క్రితమేనండీ త్రాగుతా. అప్పుడే మళ్ళీనా" అంటూనే అందుకొని వెళ్ళ

దిగా ఆప్యాయంగా చప్పరిస్తూ, కాఫీ త్రాగుతుండగా, ఆవిడ ప్రొద్దుట నుండీ జరిగిన సంగతులూ, తనకు కలిగిన అభిప్రాయాలూ అన్నీ వివరంగా చెప్పింది. చెప్పి "ఆయన రెండోసారి వచ్చి వెళ్ళినప్పుడు వాళ్ళమ్మాయి ఫోటో ఒకటి ఇచ్చి వెళ్ళాడు'' అని దాన్ని అతని చేతికిస్తూ "ఆయన కూడా కాస్త నాగరికం నేర్చుకున్నాడయ్యోయ్!'' అని నవ్విందావిడ.

"అల్లాగేం" అని అతనూ చిరునవ్వు నవ్వుతూ ఆ ఫోటో అందుకొని, కుర్చీ చేతిమీద పెట్టి "మొత్తంమీద ముసలాయనకు వియ్యాలవారి మర్యాదలు జరిపారన్నమాట" అన్నాడు మోహన్.

"దానికేం భాగ్యం కానీ. అసలు విషయం చెప్పలేదు. రేపు మనం వెళ్ళి ఆ పిల్లను చూచిరావాలి. ఆయన మరీ మరీ చెప్పి సరేనంటేనే కాని వెళ్ళలా నిన్నేలా అయినా ఒప్పించి వెంట తీసుకొని రమ్మని బ్రతిమిలాడాడు. చివరకు నేను, తర్వాత మీ అమ్మతో సర్ది చెప్పుకోవచ్చునులే అని ధైర్యంచేసి, వస్తానని వాగ్దానం చేశాను. మరి నా మాట...'' అని ఆమె అంటుండగానే మోహన్ నవ్వుతూ "మీ మాట జవదాటడం కష్టమే కాని అలా చేశారేం? స్వతంత్రించాననుకోదూ ఇంటిదగ్గర తెలిస్తే?'' అన్నాడు

"ఊ—తెలియనిస్తానా, అయినా ఎందుకయ్యా అంతభయం నీకూ. నువ్వు ముందు పిల్లనుచూడు. నచ్చితే ఆపైని భారమంతా నాది. నేను తీసుకొని వెళ్ళిచూపించాను అని వ్రాస్తే మీ అమ్మగానీ, నాన్నగారు గానీ ఏమి అనుకోరు. ఒక వేళ పిల నచ్చదూ ఇక్కడే తుంచేయవచ్చు వ్యవహారం. అయినా నేను మాత్రం పరాయిదాన్ని కాదుగా, నువ్వు సరేనను" అన్నదావిడ. మోహన్ లోపల కాస్త భయంగా ఉన్నా, మరో ప్రక్క అమిత సంతోషంగా ఉన్నా పైకి "ఊ సరేకానివ్వండి''

అని మాత్రమే అని ఊరుకొన్నాడు. ఒక్కక్షణం అలా ఊరికేనే కూర్చుని 'మరినేను వెళ్ళొచ్చుగా' అన్నట్లు చూస్తూ లేచి నిల్చుని ఆ ఫోటో అందుకొన్నాడు.

"ఇందాకటినుంచీ ఫోటో చూడనే లేదే! ఓహో అర్థమయ్యిందిలే. కాని చూచావబ్బాయ్ మా కోడలుకు ఘోషా పద్ధతులేవీ పట్టుబడడానికి వీలులేదు సుమా'' అని పకపకా నవ్వేసింది.

అందుకతనూ నవ్వుకొంటూ మేడపైకి వెళ్ళాడు. అతను తన గదిలోకి వెళ్ళి అప్రయత్నంగా తలుపులు వేసుకొన్నాడు కిటికీలోనుంచి అప్పటికే కావలసినంత వెలుగు వస్తున్నా విద్యుద్దీపం వేశాడు. తాను తాపీగా కుర్చీలో కూర్చుని, ఫోటో తీసుకొని పైన ఉన్న ఉల్లిపొర కాగితం నెమ్మదిగా తొలగించాడు. అతనొక్కసారి చకితుడయాడు అంతలో అతనొక్కసారి ఆనందపరవశుడయాడు. తా నాపగలంతా ఊహచేసిన రూపాన్ని ప్రత్యక్షంగా తన ఊహలకు పదిరెట్లు అధికంగా చూచాడు. నూత్న వధువు ప్రథమదర్శనం చేశాడు.

అతను ఆ ఫోటో వంక అలాగే చూస్తూ కొంత సేపు మౌనంగా ఉండిపోయాడు.

వెన్నెల కాంతులను నలువైపులా వెదజలుతూ, కలువలను తట్టి నిద్రలేపుతూ అంతలోనే ప్రపంచమంతా తానై ప్రకాశిస్తూ చంద్రుడు వెలుగొందుచున్న సమయంలో, వియత్పథాలనుండి, పల్చని తెల్లని అందమైన మేఘాలను ధరించి, క్రిందికి దిగివస్తూఉన్న అప్సరసవలె కన్పించిందామె. భూలోకంలో ఉన్న తన ప్రియునికై తొలిసారిగా తానుగా అభిసారికయై వస్తూ ఉన్న ఏ గంధర్వకన్యనో చూచి, పాలరాతిపై ప్రతిబింబాన్ని పట్టి చూపినట్లుగా ఉన్నదాచిత్రం.

ఆమె రూపురేఖలను అతను పరిశీలనగా చూచాడు. అంతటి సౌందర్యాన్ని ఒక్కసారిగా చూడలేకనూ పొయ్యాడు. అందువల్లనే తృప్తిగా హేలగా చూచాడు.

చూచి సంతోషించాడు. తనలో తను నవ్వుకొన్నాడు. సరిగ్గా తన మనస్సులో ముద్రితమైన రూపానికీ ఎదుట ఉన్న రూపానికీ అతి సన్నిహితమైన పోలికలు ఉండడం గమనించి, అతను మరింత సంతోషించాడు. సంబరపడ్డాడు.

ఇంత అందమైన పిల్లా!

వెంటనే నిశ్చయం చేసుకొంటే బాగుండును.

మరొకళ్ళెవరూ చూడకముందే తామే వెళ్ళి సంబంధం ఖాయం చేసుకొని వస్తే బాగుండు. అసలు పెళ్ళిగారింటికంటె కూడా ముందుగా పిల్లనోసారి చూచివస్తే?' అనుకొన్నాడు మోహన్.

"ఏ బళ్ళోనో, ఏ కళాశాలలోనో చదువుతున్న పిల్లయితే ఏదో వీలు చూసుకొని ఏ గేటు దగ్గరో నిలబడి చూడవచ్చును కాని ఈ పిల్ల విషయంలో అది కుదరదు" అని ఎవరో తన్ను ఉడికిస్తూ సమాధానం చెప్పినట్లయ్యింది.

తీయతీయగా, అతన్ని ఊరిస్తూ, ఉడికిస్తూ మధ్య మధ్య చక్కిలిగింతలు పెడుతూ, సమాధానపరుస్తూ ఎన్నో ఆలోచనలు అతని మనస్సులో మెదిలాయి. అవి మెల్లగా పిల్లగాలుల్లాగాసాగాయి. అల్లరిచేశాయి. అతన్ని కొంత అల్లరిపెట్టాయి. అతను తన అమాయకత్వానికి తానే నవ్వుకున్నాడు. కాసేపు విసుక్కున్నాడు. కొంతసేపు తర్వాత ఆయన భోగట్టా అంతా తెలుసుకుని వివరంగా, వేగంగా వ్యవహారం నడిపించని, నడిపించలేని తన తెలివితక్కువతనానికి తానే సిగ్గుపడ్డాడు.

'అబ్బే అల్లా అనీ అడిగేస్తే నేనాయనకు చులకనై పోనూ! కాదూ ఒకవేళ ఇంటిగుర్తులవీ, తెలిస్తే మాత్రం ఎవ్వరికీ తెలియకుండా ఈ రాత్రికి రాత్రి వెళ్ళి చూచిరావడం పడుతుందా? ఇల్లా అని ఎవరైనావింటే నవ్విపోతారు' అనుకొంటూ అతను తన్ను తాను కూకలేసుకొని సమాధానపడ్డాడు. చప్పున పుస్తకాలు ముందేసుకుని కూర్చున్నాడు తలుపు చప్పుడయ్యేసరికి.

'ఎవరూలేరు, గాలేకదా' అనుకొని మళ్ళీ ఏదో ఆలోచనలోపడ్డాడు. అంతలో క్రిందినుంచి హైమవతమ్మగారి కేక వినపడింది. అతను "ఏమిటండీ'' అంటూ క్రిందకు వెళ్ళాడు.

"ప్రొద్దుపోయింది, ఇప్పుడు హోటలుకేంపోతావుగాని ఈపూట ఇక్కడే భోజనంచేసి కాస్తపెందరాళే పడుకో'' అని అంటూ బలవంత పెట్టి, అతనికి అన్నం పెట్టింది. రేపు పెందరాళే నిద్రలేస్తే పిల్లలతోపాటు నీకూ వేడినీళ్ళిస్తాను. వీలైతే తలంటుకొందువుగాని" అన్నదావిడ. అతను ఏమీ మాటాడక, అన్నింటికీ ఊకొట్టి, త్వరత్వరగా భోజనం పూర్తి చేసి పైకివచ్చాడు. అతను పైకివస్తుంటే ఆమె మళ్లీ ఓసారి హెచ్చరిక చేసింది "కాస్త పెందరాళే నిద్రపోవయ్యా'' అని. మోహనుకు రాత్రిళ్ళు బాగా ప్రొద్దుపోయేదాకా చదువుకోడం అలవాటు. ఒక్కోసారి ఒంటిగంటకూడా దాటవస్తున్నప్పుడు, హైమవతి భర్త వచ్చి "పడుకోవయ్యా మోహన్ ఇంకా ఏం చదువుతావ్'' అని కోప్పడిన సందర్భాలుకూడా ఉన్నాయి. అల్లాగా మరీ ప్రొద్దుపోయి పడుకొన్నప్పుడు మరునాడు ఉదయమంతా మధ్యాహ్నందాకా అతను కొంచెం మందకొడిగా కన్పించేవాడు.

ఆవిడకు ఈ విషయాలన్నీ జ్ఞాపకంవచ్చే ఆనాడు అతన్ని అలా హెచ్చరించింది. రెండోసారి అలా హెచ్చరికచేసి, లోపలకువస్తూ, ఆమె

మరొకటికూడా అనుకున్నది. అలాఅనుకొని అంతలో పెదవికరచుకొని 'కోడలుతో ముందుగానే చెప్పాలి. అబ్బాయికి అట్టే నిద్రాభంగం కలిగించకమ్మా అని' అనుకొని నవ్వుకొన్నది.

ఆ రాత్రికి మోహనుకు అంత తేలిగ్గా నిద్రపట్టిందికాదు. ఆలోచిస్తూనో, ఊరికే కలలుకంటూనో, కాలం వృధాచెయ్యాలని అతను అనుకోలేదు. భోజనం చేసి పైకి వచ్చాక ఎంతో బుద్ధిమంతుడిలాగా పుస్తకాలు ముందేసుకొన్నాడు. కాని తెరచి పెట్టిన లెక్కల పుస్తకం, నోట్సుపుస్తకం అట్లాగే ఉన్నాయి. చేతిలోఉన్న పెన్ను అలాగే ఉండిపోయింది. ఒక్క అంకెకూడా వెయ్యలేకపొయ్యాడు. విధానం తెలిసి ఉండికూడా చేద్దామనుకొన్న లెక్కసాగలేదు. అతను మరోపుస్తకం తీసి చదవడం మొదలుపెట్టాడు. కాని అదీ సాగలేదు. మనస్సు బల్లమీద రికార్డు పుస్తంలో దాచి ఉంచిన ఫొటో మీదకే పోతున్నది. ఇంక లాభం లేదని చదువు కట్టిపెట్టి, ప్రక్క పరచుకొని, ఇంకా దాపరికం దేనికని ఆ ఫొటోనుబల్లమీద తన కెదురుగా, బాగాకన్పించేలాగున అమర్చి, నడుం వాల్చాడు మోహను.

అతను పదిగంటలు దాటాక ఆలోచనల ప్రవాహాలకు అడ్డుకట్టలు వెయ్యాలని ప్రయత్నాలు చేస్తూ చేస్తూ, తన ప్రయత్నాలు వెను వెంటనే సఫలం కాకపోవడంచేత ఆ విషయాన్ని మొదటినుంచి కొసదాకా ఒక్కసారి సింహావలోకనం చేసి, తన అందచందాల విషయమై ప్రసక్తివచ్చి, తన కుటుంబంలో జరిగిన వివాహాది శుభకార్యాలలో వదినలు, మరదళ్ళూ, మేనత్తలూ తన్నుగురించి పలికిన ప్రశంసా వాక్యాలు జ్ఞాపకం చేసుకొని, తృప్తిపడి, 'ఇంక నిద్రపోవాలి, పిన్నిగారు అన్నిసార్లు చెప్పింది,' అని అనుకొంటూకూడా చాలా సేపు మేల్కొనే ఉండి చివరకు అప్రయత్నంగా నిద్రపోయాడు మోహన్. మంచినిద్రేపట్టింది అతనికి.

తామిద్దరూ వీధి గుమ్మంలోనే ఆగిపోయారు. ఆపిల్ల అవతల గుమ్మంలోనే ఆగిపోయింది. ఆ అమ్మాయి తెల్లని గ్లాసో చీరకట్టుకొన్నది. గ్లాసో రవిక పాతపద్ధతిలో కుట్టించినది తొడుక్కున్నది. పగటి పూట అయితే ఆమె శరీరగతమైన సర్వ సౌందర్యమూకాస్త పరీక్షగా చూడక ముందే కన్పించిపోను. అదే జరిగితే అతని గుండెల్లో రైళ్ళు పరుగెత్తి ఉండేవి. తికమక పడి ఉండేవాడు. హైమవతమ్మగారు "ఇదేం వస్త్ర ధారణమమ్మోయ్—మనకి తగునటమ్మా" అని ముఖంమీదే గుమ్మం లోనే అనేసిఉండేది.

కాని ఎందువల్లనో ఎవరూ ఏమీ మాటాడలేదు. పైగా వాతావరణ మంతా పొగమంచు కమ్ముకొన్నట్లుగా ఉన్నది. అందువల్ల కాబోలు ఆమె ఏమీ అనలేదు. కాని మోహన్ ఆమె వంక ఆమె స్నిగ్ధతనూ,లావణ్యాన్నీ పరీక్షిస్తూ చూడడం గమనించింది. అతన్ని మందలిద్దామనుకుంటూనే ఆమెకూడా అపిల్ల వంక చూస్తూ ఉండిపోయింది. మంచులో ముంచి ఎత్తిన తెల్లని కలువపూవులా ఉన్న అమె ముఖంలో సౌందర్యం కొట్టి వస్తూనే ఉన్నది. ఆమె పెదవులు లేత గులాబీ రేకలను ధిక్కరిస్తున్నాయి. స్నిగ్ధమూ. కోమలమూ అయిన ఆమె చెక్కిళ్ళపై. చెవులకున్న రాళ్ల దుద్దుల ఎఱ్ఱని కాంతులు సన్నగా, ప్రసన్నంగా ప్రతి ఫలిస్తున్నాయి. అంత లోనే ఆ కాంతులను ప్రన్నని ఆ మృదుకపోలాలు త్రోసివేస్తూ ఉన్నాయి. ఎంతో ఆకర్షిస్తూనే ఉన్నదా అమ్మాయి. దేవకన్యలా మెరసి పోతూనే ఉన్నదా పిల్ల./ బొడ్డుమల్లెలా అందాలు పోగేసుకొని కూర్చునట్లే ఉన్నది. తీగసంపెంగలా విలాసంగా, నాజూగ్గానే కన్పిస్తున్నది. మసకమసక కాంతిలో కూడా తళతళ మెరసిపోయే మంచి ముత్యాల్లాగా ఆ పిల్ల కళ్ళు మిలమిల మెరుస్తూనే ఉన్నాయి. ఆ పిల్ల ముందుకువచ్చినప్పుడు ఆ నడకలో యౌవన వయోవిలాసవతి నడకలో సహజంగా ఉండవలసిన మంద గమనం, ఆ ఒయారం, ఆ ఉలుకూ, ఆ సొగసూ స్పష్టంగా కన్పడుతూనే

ఉన్నది. అచ్చమూ, అమాయకమూ అయిన ఆమె ముఖోత్పలముపై ప్రేమ చంద్రుని కాంతులు ప్రసరించి అందంగా, ప్రతిఫలిస్తూనే ఉన్నాయి. నవ వధువులా సిగ్గు తెర అతిప్రయత్నం మీద తొలగించుకొని చూస్తు న్నట్లూ ఉన్నది.

కాని...కాని....

కాని ఆమె నలా ఒక్కసారి పరీక్షగా చూచేసరికి ఎందువల్లనో నిశ్చలంగా నిలచిపోయింది. మరికొన్ని క్షణాల తర్వాత నిల్చునట్టే ఉండి, నిలుచున్న చోట కన్పించలేదు. అలాగని హైమవతమ్మగారికి ముందుగా అనిపించింది. ఆమెగారు విభ్రాంతిపడి నిలిచింది. "అదేమబ్బా'' అని సందేహంలో పడి, అతను అటూ ఇటూ చూచి, మళ్ళీ ఎత్తుగా ఎదురుగా ఉన్న ఫొటోవంక కన్నార్పకుండా చూస్తూ ఉండిపోయాడు. హైమవతమ్మ గారు మోహన్ను 'నీక్కాదూ చెప్పేదీ, ఎందుకలా చూస్తావ్' అన్నటు ఉరిమి చూస్తూ మోచేత్తో పొడిచింది.

మోహనుకు చప్పున మెలకువ వచ్చింది. ఒక్క అర్ధ క్షణం క్రితం తన్ను ఎవరో నిజంగానే మోచేత్తో పొడిచి హెచ్చరించి నట్లుగానే ఉన్నది. సరిగ్గా అలానే అనిపించింది. కలపూర్తిగా కరిగిపోయింది. నిలువెత్తు మంచు విగ్రహం నిమిషంలో చూస్తుండగానే కరగిపోయినట్లుగా అంత సౌంద ర్యమూ, అంతలోనే అదృశ్యమైనట్లుగా, అతని మనస్సు కాస్త చెదిరింది "ఏమిటీ కల? ఇలా వచ్చిందేమిటి?'' అని పలుసార్లు పశ్నించు కొన్నాడ తను. కొంచెం చిరాకు పడ్డాడు. ఎంతకూ సమాధానం దొరక్కపోయే సరికి అతను వెంటనే ప్రక్కమీదనుంచి లేచివెళ్ళి గ్లాసుడు మంచినీళ్ళు త్రాగి, కాసేపు కుర్చీలో ఊరికే కూర్చున్నాడు. ఇదేమిటి 'ఇంత వెఱ్ఱివాణ్ణవుతు న్నాను" అని అనుకొని తన్నుతాను సమాధాన పరచుకోవాలని ప్రయత్ని నేస్తూ చాలాసేపు అలాగే ఉండిపోయాడు.

అంతలో బుద్ధిపుట్టి పుస్తకంలోనుంచి ఆ ఫొటోతీసి దానివంకే చూస్తూ కూర్చున్నాడు.

యౌవన నవవిలాసం! పూలపొదలపైన కొనలుతేలుతూ మంద మలయ పవనాలకు కూడా ఓర్వలేక ప్రక్కలకు ఒరిగిపోతూ ఒయారాలు పోతూ ఉన్న ఏలకీలతలాగా ఉన్నది. తమలపు తీవెలా చూచిన కొద్దీ నవ నవలు వెదజలుతూనేఉన్నది. తన బాహువులను ఆ లావణ్యలతకు ఆధారంగా అందివ్వాలని అనిపించింది మోహనుకు. అల్లాగని అనుకొనే సరికే అతని ఒడలంతా ఒక్కసారి పులకరించింది.

"ఇప్పుడే ఇలా అనుకోవడం ధర్మం కాదు. ఎవరైనా చూస్తే బాగుండదు సుమా' అనుకొంటూ, ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ, లేచి వెళ్ళి విద్యుద్దీపం తీసి నెమ్మదిగా ప్రక్కమీద నడుంవాల్చాడు. 'నీవల్లా అనుకోవడం తప్పుకాదూ?' అని ఎవరో ప్రశ్నించినట్లయి 'అబ్బే అంత తప్పేంకాదు. ఆ పిల్ల నన్నుకలలో కవ్వించింది. కనుక నేను ఇలలో భావనలో సరసమాడాను. మరేంతప్పు కాదు' అని సమాధానం చెప్పుకొన్నాడు. అందువల్ల అతనికి తృప్తికలిగింది. తృప్తిగా సుఖంగా నిద్రపోయాడు.

అతనికి కొంచెం పెందరాళే మెలకువ వచ్చింది. మత్తెక్కించే సువాసనలు వెదజల్లే పూలపొదరిండ్ల ప్రక్కగా చాలాసేపు నడిచి వచ్చినట్లున్నది. అతని కింకా.కొద్దిగా మత్తుగానే ఉన్నది. ఆమత్తుదనం కొంత చిత్రంగా, మధురంగా కన్పించింది. హృదయం తేలికగా ఉన్నట్లు అనిపించింది.

ప్రభాతవాయువులు మందమందంగా ప్రసరిస్తున్నాయి. అవి అప్పుడప్పుడే విడిపోతున్న పొగమంచు తెరలతో దోబూచులాడుతున్నాయి.

చెట్లగుబురులను తాకుతూ, సన్న సవ్వడులుచేస్తూ, ఆ గాలులు ఉషస్సులో ప్రకృతి కాంత ప్రపంచానికై పాడుతున్న మేలుకొల్పులకు తాము వంత పాటలు పాడుతున్నాయి. అవి నెమ్మదిగా శరీరాన్ని తాకి నూతనోత్సాహాన్ని కలిగిస్తున్నాయి. పులకరింతలు కలుగజేస్తున్నాయి. రాత్రంతా వెన్నెలలో, మంచుతో నీటి అలలపై తేలుతూ, ఒయ్యారాలు పోతూ, ఒళ్ళు విరుచుకొంటూ కదలాడుతూ ఉన్న కలువలు ప్రభాత వాయువులను మరింత పరిమళవంతం చేస్తున్నాయి. శైత్యాన్ని చేకూరుస్తున్నాయి.

మోహను లేచి కూర్చున్నాడు.

రాత్రి తనకు కలిగినవిచిత్రానుభూతి ఏదో అస్పష్టంగా స్ఫురణకు వచ్చింది. రాత్రి తా నాలోచించిన విషయం మరింత మధురంగా అనిపిస్తూ జ్ఞాపకం వచ్చింది. అతను మందహాసం చేశాడు. లోపల ఎంతో తృప్తిగా సంతోషంగా ఉన్నది.

మోహన్ గబగబా క్రిందకు వెళ్ళి త్వరత్వరగా కాలకృత్యాలు తీర్చుకొని కాఫీకి వెళ్ళి వచ్చాడు.

మోహన్ కాఫీకి వెళ్ళి తిరిగి వచ్చేసరికి అప్పుడే ఎనిమిది గంటలయింది. అతను సరాసరి ఇంటికి రాక, ఒకరిద్దరు మిత్రులతో ఉల్లాసంగా పిచ్చాపాటి మాటాడి ఆలస్యంగా వచ్చాడు. అతను ఇంటికి వచ్చేసరికి గుమ్మం ముందు గుఱ్ఱపుబండి ఒకటి ఆగిఉన్నది. అతనుపైకి వెళ్ళబోతుంటే ఆవిడ వసారాలోనే ఎదురై "ఎక్కడికి వెళ్ళావయ్యా ప్రొద్దున్నే–కాఫీ ఇక్కడ ఇవ్వకపోయినానా —— సరెసరె, ఆయన వచ్చి చాలా సేపయ్యింది. నువ్వు వేగం వచ్చేయాలి" అంటూ తొందరపెట్టింది. రెండేసి మెట్లు ఒకేసారి ఎక్కుతూ మోహను ఒక్క నిమిషంలో పైగదిలోకి వెళ్ళాడు. కూజాలో నీళ్ళు వంచుకుని సబ్బుతో రెండుసార్లు ముఖం

కడుక్కొని, టర్కీ తువ్వాలతో ఒత్తితుడుచుకొని, పౌడరు రాచుకొని. తల దువ్వుకొన్నాడు. అతను తల దువ్వుకొని బట్టలు మార్చుకోడానికి దాదాపు పది నిమిషాలు పట్టింది. "ఇంకా కాలేదుటయ్యా నీ ముస్తాబూ'' అని క్రింద నుంచి హైమవతమ్మగారు రెండుసార్లు కేకలు పెట్టింది. అతను ముస్తాబు పూర్తి చేసుకొని గుమ్మందాకా వచ్చాక మళ్ళీ ఆ ఫోటో ఒకసారి చూడాలని అనిపించి, తలుపు దగ్గరగావేసి, అల్లాచూస్తూ నిలబడ్డాడు. అంతలో ఆవిడ నెమ్మదిగా తలుపు నెట్టుకొని లోపలకువచ్చి, అతన్ని చూచి ఒక్కసారి పకాలున నవ్వేసింది. "ఇందుకా ఇంత ఆలస్యం చేస్తా...సరె. సరె బయలుదేరు'' అన్నా దావిడ. "అచ్చే లేదండీ నాదేం ఆలస్యంలేదు పదండి" అంటూ మెట్లుదిగాడతను. "చేయవలసిన ఆలస్యమంతా ఇందాకే చేశావులే...పద" అంటూ నవ్వుతూ ఆవిడ అతన్ని అనుసరించి క్రిందకువచ్చి, ప్రయాణపు ఏర్పాట్లు త్వరత్వరగా పూర్తిచేసింది. ఆఫీసు జవాన్ని "ఇల్లుజాగ్రత్త. నేను పది నిమిషాల్లో వచ్చేస్తాను'' అంటూ హెచ్చరికలుచేసి, పెద్దపిల్లతో "ఎక్కడికీ వెళ్ళకండమ్మా'' అని చెప్పి, పళ్ళబుట్ట ముందు బండిలో పెట్టి, ఆవిడ బండి ఎక్కింది. ఆవిడ తర్వాత ఆయన నెమ్మదిగా బండిలో ఎక్కి కూర్చున్నాడు. మోహన్ తన దుస్తులు నలిగిపోతాయని వాళ్ళతోకాక వేరే రిక్షా చేయించుకొన్నాడు.

ఆయన దారిపొడుగూరా హైమవతమ్మగారితో ఏదో చెబుతూనే ఉన్నాడు.

పిల్లను చాలా గారాబంగా పెంచాడట తను. తన భార్యలయినా ఎప్పుడైనా చిన్నప్పుడు కోపంవస్తే ఓదెబ్బ వేసి ఎరుగునటకాని తానెన్నడూ పల్లెత్తుమాట కూడా అనలేదట. అసలు మాట అనిపించుకోనే పిల్లకాదట ఆ పిల్ల. ఒక్కతేపిల్ల కావడంచేత తన కున్న ఆస్తిపాస్తులన్నీ క్రమంగా ఆపిల్లకే చెందుతవట. పిల్ల పైకికాస్త నాజూగ్గా కనిపించినా,

అవసరమైతే ఎంత చాకిరీఅయినా పైన వేసుకొని నిర్వహించుకొని పోగలదట. పెద్దపిల్ల అయినప్పటినుంచీ ఇంటి బాధ్యతలన్నీ స్వయంగా, చూచుకొంటున్నదట. అలాగా ఆయన తన బిడ్డనుగురించి వివరంగా ఎడతెగకుండా చెప్పుకొనిపోతూంటే మొదట కొంత కుతూహలం వల్లనూ, తర్వాత కొంత క్రొత్తవాడు, అందులో పెద్దవాడు— ఆయన చెబుతూ ఉండడంవల్లనూ హైమవతమ్మగారు సావధానంగానే విన్నది. చాలా సేపు ఓపిక వహించి ఊకొడుతూ కూర్చున్నది. కాని, పోను పోను ఆయన మాటలు మరీ పిచ్చిగా కనిపించేసరికి, ఆయన చెప్పిన విషయాలు మళ్ళీ మళ్ళీ చెప్పడం మొదలుపెట్టే సరికి, ఆవిడకు నిజంగా విసుగుపుట్టింది. చివరకావిడ "ఎందుకండీ బాబుగారూ మీరు ఇంత వివరంగా చెప్పాలా?—చూట్టానికే వస్తున్నాంగా. మీరు కాస్త విశ్రాంతిగా కూర్చోండి" అనేసింది. హైమవతమ్మగారామాట అన్నాక ఆ ముసలాయన చప్పున మాటాడం ఆపేసి, ఇంక మళ్ళీ ఉలకనూ లేదు, పలుకనూ లేదు. బెల్లం కొట్టిన రాయిలా అలా కూర్చుండి పోయాడు. పైగా ఏదో దిగులుగా ఎటో చూస్తూ ఉండిపోయాడాయన. వాళ్ళ యింటి గుమ్మం ముందు బండి ఆగాక కూడా ఆయన నోరు మెదపలేదు. ఆయన మాటాడకుండా బండిదిగాడు. ఆవిడ నెమ్మదిగా బండిదిగి, బండివాడిచేత పళ్ళబుట్ట దింపించింది. "మీరు పదండి. నేను బండివాడికి డబ్బులిచ్చి వస్తాను" అని మూగసంజ్ఞలుచేసి చెప్పాడాయన. ఆ యింటి గుమ్మంముందు నిల్చుని ఆవిడ ఆయన ప్రవర్తనకు ముసి ముసి నవ్వులు నవ్వుకొన్నది.

ఆ యింటి ముందు ముత్యాలతో ముగ్గులు పెట్టినట్లయ్యింది.

మోహన్ను కలుపుకొని "బండి ఆగిన చప్పుడు వినిపించినా ఇంటి వాళ్లు బయటకు రాలేదేమా" అను కొంటూ దగ్గరగావేసి ఉన్న తలుపు

నెట్టుకొనిఆవిడ లోపలకు వెళ్ళింది. కాని చావడి ఖాళీగా ఉన్నది. చావలైనా పరచిలేవు. ఒక క్షణం వీరిద్దరూ అక్కడే ఆగిపోయారు. "ఎవరండీ వస్తా?" అంటూ అవతల గదిలో నుంచి ముందుగదిలోకి వచ్చిందొక ముత్తయిదువ. మంచి దబ్బపండు ఛాయలో ఆమె అంత వయస్సులోకూడా ముచ్చటగానే ఉన్నది. ఆవిడ పెద్ద కుంకుమ బొట్టు పెట్టుకొన్నది. వంగపండు రంగు చీరకట్టుకొన్నది. సన్నని జరీ అంచుగల రవిక తొడుక్కున్నది. జుట్టు ముడివేసుకొన్నది. విశాలమైన ఆమె కళ్ళు ఎంతో ఆర్ద్రతను ప్రకటిస్తున్నాయి.

మోహన్ ఆవిడ ముందుగా కన్పించేసరికి ఒక్క క్షణం నిరుత్సాహ పడ్డాడు. ఎవరా వచ్చిందని పెండ్లికూతురేవచ్చి తన్ను చూచి లోపలకు తుర్రుమంటుందని అతనూహించాడు. 'వాళ్ళకు తెలుసుగదా మనం వస్తున్నామని. అందువల్ల ముస్తాబై లోపలే దాక్కొని ఉంటుంది' అని అనుకొని సమాధానపడ్డాడు. నిజంగా అదే బాగుంటుంది. ముందుగా కన్పించేస్తే పెళ్ళిచూపుల సొగసే ఉండదు, అని కూడా అనుకొన్నాడు మోహను. క్రిందటి వేసంగి సెలవుల్లో మిత్రుడొకడు పెళ్ళిచూపులకు వెళుతూ తన్ను తోడుతీసికొని వెళ్ళాడు. ఆనాటి దృశ్యమంతా అతని కొక్కసారి స్ఫురణకు వచ్చింది.

అంచక్కా అలంకారాలు చేసికొని వచ్చి తల్లో, మేనత్తో చెయ్యి పుచ్చుకొని తీసికొని వచ్చి కూర్చోబెడితే, ఎంతో సిగ్గు పడుతూ కూర్చుని, ఎన్నివిధాల మాటాడించినా మొదట్లో మాటాడకపోవడం, తర్వాత క్రమంగా మాటాడడమూ, అతి బలవంతంమీద ఒకటి రెండు పాటలుకూడా పాడడమూ ఇది సహజంగా జరిగేవిషయం. వధూవరులు-ఎవరూ తమ్ము చూడనప్పుడు, అప్రయత్నంగా కొన్నిసార్లూ, ప్రయత్న పూర్వకంగా మరికొన్నిసార్లూ చూచుకొంటూ సిగ్గుపడడం.

సిగ్గుపడుతూనే చూచుకోవడం. అతను తనవంక చూడటం లేదనుకొని, భ్రమపడి పెండ్లికూతురు ధైర్యంచేసి పెండ్లికొడుకువంక చూడడం – చూపులు కలియడం – అప్పి నిలువునా సిగ్గుపడి పోవడం– ఇలాంటి సంఘటనలు ఎంత మధురమైన ఆనందానుభూతి నిస్తాయో, ఆనాడు కొంతగా తెలిసింది మోహనుకు. అప్పుడతను తన మిత్రుణ్ణి, మిత్రునికి కాబోయే భార్యనూచూచి, వాళ్ళ ఆనందాన్ని చూచి తానూ సంబరపడుతూ తనకూ అట్టి అనుభూతి స్వవిషయంలో కావాలని రహస్యంగా కోరు కొన్నాడు.

ఆ విషయమంతా మనస్సులో ఒక్కసారి మెదలేసరికి ఒక్క సారి అలా తనపై మల్లికా ప్రసవ సౌరభభరితమైన మలయమారుతం మంద మందంగా ప్రసరించి, క్రమంగా నీటి అలలాగా దూర దూరంగా కదలి వెళ్ళినట్లయింది. చిరునవ్వులతో అతని ముఖం వికసించింది.

"ఇంకా నిలబడే ఉన్నారేమిటి? కూర్చో అమ్మాయి. కూర్చో నాయనా'' అని ఆవిడ ఇద్దరికీ ఆసనాలు చూపింది.

హైమవతమ్మగారు మోహన్ను కూర్చోమని, ఆవిడతో "అయితే ఇంతకూ మేం వస్తున్నట్లు బాబాయిగారు ముందుగా చెప్పనేలేదా ఏమిటి?" అన్నది.

ఆమాట కాముత్తయిదువ వెంటనే సమాధానం చెప్పలేదు.

మోహన్ అక్కడ మంచికుర్చీలున్నా వెంటనే కూర్చోక ముసలా యన ఇంకాలోపలకు రాలేదేమా అని ముఖద్వారంవైపు చూస్తూ ఒక్క క్షణం అలాగే ఉండిపోయాడు. ఆవిడ ఆ కుర్రవానివంకా, హైమవతమ్మ గారి వంకా చూస్తూ, ఏదో ఆలోచనలో పడి ఓక్షణం తర్వాత తెప్పరిల్లు కొని కూడా ఏం చెప్పాలో తోచక, ఏమని చెబితే మర్యాదగా ఉంటుందో

తెలియక తికమకపడ్డది. అసలు వీళ్ళు తనయింటికి ఎందుకు వచ్చారో-వారెవరో కూడా వెంటనే స్ఫురించ లేదావిడకు.

ఆవిడ అలాగా వెంటనే మాటాడకపోవడం చూచి హైమవతమ్మగారు "ఈ వెఱ్ఱిబాగుల మనిషి ఇంట్లో చెప్పకుండానే ఇంత హడావిడీ చేసిఉంటాడు" అన్న నిర్ణయానికి వచ్చి "పోన్లెండి-చెప్పడం మర చారో ఏమో." అంటూ ముందుకువెళ్ళి "రండి పిన్నిగారూ లోపలకు వెళదాం" అన్న దావిడతో.

తామిద్దరూ లోపలకువెళ్లి, అన్ని విషయాలూ వివరంగా మాటాడుకొని పిల్లను మూడు నిషాల్లో ముస్తాబుచేసి, తీసుకొనివచ్చి చూపిద్దామనుకొన్నది హైమవతమ్మగారు. వాళ్లు నిర్లక్ష్యం చేస్తున్నారేమోనన్న భావం మోహనుకు ఎంతమాత్రమూ కలుగనీయకూడదని ఆవిడ లోలోపల ఎంతో తాపత్రయ పడది. అందువల్లనే చనువుగా ఆవిడగారి చెయ్యి పుచ్చుకొని కాస్త త్వరత్వరగా లోపలకు అడుగులు వేసింది. గుమ్మం అవతలకు వచ్చాక నెమ్మదిగా "మాది మీ శాఖేనండీ. ఆ అబ్బాయి తండ్రీ మావారూ పెత్తండ్రి పినతండ్రి కొడుకులు. అతను మాయింట్లోనే ఉండి చదువుకొంటున్నాడు. చాలా బుద్ధిమంతుడు. నిన్న దాబాయిగారువచ్చి అన్నీ విచారించి అతన్ని చూచి వెళ్ళారు. నాతో అన్ని విషయాలూ మాట్లాడారులెండి. అయితే తెలియకడుగుతాను మీకు అలు చెప్పనేలేదా ఏమిటండీ?" అని అడిగింది హైమవతమ్మగారు. "ఏమిటి చెప్పలేదంటారూ?" అని అసలేక అనలేక అన్న దాముసలాయన భార్య.

"అప్పుడే ఈ వియ్యపురాలితో పరిహాసాలు కూడానా! అదేనండీ పిల్లని చూట్టానికి తరలి వస్తున్నామని చెప్పలేదా అని అడిగాను. సరేపోన్లెండి. ఇప్పుడు మించిపోయిందేమీలేదు. ఒక్క నిమిషంలో ముస్తాబు చేయించేస్తాను. అదీ ఏదో లాంఛనం కనుకా. అందులోనూ

కొంత కొత్తవాళ్ళం కనుకాన్నూ, లేకపోతే ఇలావచ్చి చూడాలా ఏమిటి? మనంమనం మాట్లాడుకొని నిర్ణయాలకు వచ్చేవాళ్ళం. ఇంతకూ అమ్మాయి పేరేమిటన్నారూ? ఏదీ ఇంకా లోపలే దాక్కొన్నదా ఏమిటి! మరీ అంత సిగ్గయితే ఎల్లాగండీ'' అంటూ హైమవతమ్మగారు ఎంతో కలుపుగోలుగా, ఏదో మాటాడేస్తూనే ఉన్నది. కాని ఎదుటఉన్న మనిషి మొదట నిర్ఘాంతపోయి—అంతలో కొయ్యబారిపోయి, అంతలో మహాసముద్రపు పొంగులా ముంచుకొనివచ్చినఆవేశానికితట్టుకోలేక కూలబడిపోవడంగమనించనేలేదు. మరుక్షణంలో గమనించినా పరిస్థితిఎంతమాత్రమూ అర్థమే కాలేదు. "అరెరె అదేమి'' అంటూ హైమవతమ్మగారు ఆశ్చర్యపడుతూ, ఖంగారు పడుతూ అడుగుతూనేఉన్నది. కాని ఆవిడ వినిపించుకోలేదు. పెద్దగా ఏడుస్తూ "అయ్యో! నా తల్లీ! నీకు పెళ్ళి సంబంధం తెచ్చాడే మీ నాన్న'' అని తిట్టాదు కొంటూ దుఃఖపు పొంగులో మాటలురాక బొంగురుపోయిన కంఠంతో "నాకంత భాగ్యమా! అమ్మాయి లేదమ్మా లేదు'' అని మళ్ళీ పెద్దగా ఏడ్చింది. హఠాత్తుగా ఏడ్పువినిపించేసరికి చరచరా లోపలకువచ్చి గుమ్మంలోనుంచే ఆ దృశ్యంచూచి నిర్ఘాంతపడి పోయాడు మోహన్. అతను వచ్చి చూచేసరికి ఆ ముసలావిడ క్రింద నేలమీద కూలబడిఉన్నది. ప్రక్కగా హైమవతమ్మగారు కూర్చుని ఆవిడని ఓదార్చాలని ప్రయత్నం చేస్తోంది. అతనికేమీ అర్థంకాక "ఏదేమిటండీ పిన్నిగారూ...ఎందుకావిడ'' అని ఆగిపోయాడు. అతనికి మొదట ఆవిడకు మూర్ఛవచ్చిందేమోననీ. శారీరక దౌర్బల్యమేమైనా ఉన్నదేమోననీ అనుకొన్నాడు. హైమవతమ్మగారికి క్రమంగా విషయం అర్థమైంది. అవతలకు వెళ్ళమని అతనికి సంజ్ఞచేసింది. అతను ఆవిడ వైపు చూచేసరికే వాళ్ళవెనుక గోడమీద ఎత్తుగా వ్రేలాడతీయబడి ఉన్న పెద్ద సైజు ఫొటో ఒకటి కన్పించింది. కించిన్మాత్రంకూడా ప్రయత్నం లేకుండా మోహన్ ఆ పిల్లను వెంటనే పోల్చుకొన్నాడు. ఒక్కనిమిషం కన్నార్పకుండా ఆ ఫొటోవంకే చూస్తూ నిల్చున్నాడు అతను.

ఆడవాళ్ళిద్దరూ అతనలా చూడడం గమనించారు. అతన్ని చూచి మళ్ళీ పెద్దగా ఏడ్చిందావిడ. అతని మనస్సు ఒక్కసారి కలుక్కుమన్నది అతనాముసలిముత్తయిదువ దుఃఖంచూడలేక, ఆతల్లిఆక్రోశం

వినలేక, ఆ స్థితిని చూచి తట్టుకొనే శక్తి లేక, చప్పున అక్కణ్ణించి సీధిగుమ్మంలోకి వచ్చేశాడు. వెనుకనుంచి మాటలు వినపడుతున్నాయి. "చిన్నవాడు అబ్బాయి మనస్సుకూడా కష్టం కలిగించానమ్మా దౌర్భాగ్యురాల్ని-ఇదంతా మాఖర్మ. దాన్ని మొదట్లో వారి బావమరిదికే ఇద్దామను కున్నాం. అది కృష్ణుడి పెళ్లామనే అంటూ ఉండేవారాయన. కాని వాడు పీ అందానికి నేను తగను అని ఖచ్చితంగా చెప్పేసి ఓ సత్యను పెండ్లాడే శాడు. అలా అనుకొన్న సంబంధం కుదరలేదు. అప్పటినుంచి సంబంధాలు ఇతరత్రా చూస్తూన్నాం. పెళ్ళి ప్రయత్నాలు చేస్తుండగా హఠాత్తుగా జబ్బుచేసి పిల్ల నా రుక్కమ్మ..." అని చెప్పలేక పెద్దగా ఏడ్చి, ఎంతో కష్టంమీద దుఃఖం ఆపుకొని "అప్పటినుంచి ఆయనకు మతి స్థిమితంగా లేదు మరీ ఈమధ్యఎక్కువవుతున్నది. నిన్న దానిపుట్టినరోజు పండగ... ఆయన...'' అని ఇంక ఒక్కమాటకూడా చెప్పలేక వెక్కి వెక్కి ఏడ్వడం మొదలుపెట్టింది.

మోహన్ వీధి గుమ్మంలోనుంచే పిన్నిగారూ "మీరు తర్వాత కాస్త నెమ్మదిగా రండి, రిక్షా పంపిస్తాను. సరేనా ?'' అని చెరచెరా ముందుకు వెళ్ళిపోయాడు ఆవిడ సమాధానం అయినా వినకుండా. అతను అంతకంతకు వేగంగా నడిచాడు. అంతవేగంగా నడుస్తున్నా / విరియ బూచిన నిత్యమల్లిలా అందంగా, నిత్య నూతన వధువులా ఆపిల్ల అతని కళ్ళముందు ప్రత్యక్షం అవుతూనే ఉన్నది. ఆ ఫోటో ఇంకా అతని మనస్సులో మెదలుతూనే ఉన్నది. నీళ్ళునిండిన కళ్లనోసారి అప్రయత్నంగా తుడుచుకొన్నా డతను. జరిగిన విషయమంతా ఒక్కసారి అతనికి జ్ఞాపకం వచ్చింది. నిజంగా జరిగిన ఒక వాస్తవ విషయం నిజమని అంగీకరించ డానికి అతని మనస్సు గట్టిగా నిరాకరించింది. అతనేదో గొణుక్కుంటూ బాధపడుతూ ముందుకు సాగిపోయాడు.



# జీవితంలో మలుపు

ఆ విషయంలో ఇతరులు ఎవరు ఏమని అనుకొన్నా మాధవయ్యగారు మాత్రం 'ఇంత ప్రమాదం జరిగిందే! ఈ కుఱ్ఱవాడు ఏమైపోతాడో!' అనుకొని భయపడ్డారు. ఆయన ఎంతో బాధపడ్డారు. అన్నాళ్ళూ అతని కోసమై పడినశ్రమ అంతా ఇలా యథాయథమై పోతున్నదే అని ఆయన ఎంతో మధనపడ్డారు.

అంతలో ఆయనకు ఒక ఆశ కలిగింది. అది కేవలం ఆశమాత్రమే ఆ సంగతి ఆయనకూ తెలుసు. తెలిసికూడా అతనంటే ఉన్న అపేక్షకొద్దీ, జాలికొద్దీ ఆయనలా ఆశ పెంచుకొన్నారు. 'అవధాని ఈ గండంగడచి బయటపడతాడు. తప్పకుండా ఈ గండం గడుస్తుంది. నా మాట దక్కుతుంది.' అనుకొన్నారాయన ఒకటికి రెండుసార్లు. పరాయిపంచన కాలం గడుపుతున్నా రోగం రొష్టూ లేకుండా ఉంటూ, బుద్ధిగా మెలగుతూ, క్రమంగా పైకివస్తున్నవాడికి హఠాత్తుగా ప్రమాదం జరిగేసరికి ఆయన మనిషి నిలువునా నీరై పోయారు. ఏమిచేయడానికీ వెంటనే ఏమీ తోచలేదాయనకు.

ఆయన భార్య రంగనాయకమ్మగారికి మొదట కోపంవచ్చింది. తర్వాత భయంవేసింది. 'నా ఇంట్లో ఉండగా అతనికి ప్రమాదం సంభవించిందే. పైగా ఆపని నేనుచెప్పానే! ఏదైనా అన్యాయం జరిగితే ఆ పాపం నాకు చుట్టుకొంటుందేమో!' అని భయపడదావిడ. 'లేనిపోని బెడద నా యింటికి వచ్చిపడుతోందే. దీనికి కారణం అతనేకదా' అని కోపగించుకొన్నది ఆవిడ. అతన్నీ, అతన్ని తమఇంట వదలివెళ్ళిన అతనితండ్రిని మనసులో ఎన్నో అన్నది. అంతలో జాలిపడి, చేతులు

జోడించి అతనికి అగండం గడిచేలా చేయమని భగవంతుణ్ణి ప్రార్థించింది ఆపిల్లల గన్నతల్లి.

మాధవయ్యగారు ఆవిడ పరిస్థితి చూచి, ఆవిడకు కొంచెం ధైర్యం చెప్పి, తాను నిదానంగా, జాగ్రత్తగా ఆలోచించడానికి ప్రయత్నించారు. కాని అందుకు వ్యవధిలేదని అనిపించింది వెంటనే. దాంతో ఆయన మరీ గాభరాపడ్డారు.

జరిగిందేమో ప్రమాదకరమైన విషయం.
ఏమో ప్రాణాపాయమే సంభవించ వచ్చును.
పైగా అది జరిగికూడా కొన్నిగంటలు అయింది.
ఎలా పరిణమిస్తుందో ఏమో!

అలా అనుకొంటూ ఆయన గబగబా ఒకసారి ఇంట్లోకి, మరోసారి అతనుండే ముందుగది గుమ్మందగ్గరికూ వెళ్ళి వచ్చారు. ఆ విషయం ముందుగా ఆయనకే తెలిసింది. అతనే స్వయంగా చెప్పాడుకూడాను.

ఆరోజు మధ్యాహ్నం అంతా తిరిగి, ఆయన మూడుగంటలకు ఇంటికి కాఫీ తాగుదామని వచ్చి, మళ్ళీ బయటకు వెళ్ళవలసిన పనిఉండి కూడా ఓపికలేక వెళ్ళలేక, అతన్ని ఆపనిమీద పంపుదామని ఆ గదిగుమ్మం దగ్గరికి వచ్చిన మాధవయ్యగారు అతను ఏదో తపన పడుతున్నట్లు ఇట్టే గ్రహించారు. ఏమిటి విషయం, ఏం జరిగిందని పదిసార్లు అడిగారు. చెబితే ఏమంటారోనని, చెప్పక ఇంకా ఆలస్యంచేస్తే ఏం ప్రమాదం ముంచుకొని వస్తుందోనని భయపడ్డాడు అవధాని, అలా భయపడుతూనే అతను చెప్పక తప్పిందికాదు. క్లుప్తంగా చప్పున చెప్పేశాడతను. అతను అనుకొన్నదంతా అయింది. ఆయనకు మొదట చర్రున కోపంవచ్చింది. "ఇంత అజాగ్రత్త పెద్దవ్వయితే ఎలారా!" అంటూ అతనిమీద ఎగిరిపడ్డారు. "మరి ఇంత సేపూ నాకెందుకు కబురుచెయ్యలేదు!"

అంటూ ముందు అతన్నీ ఆ తర్వాత భార్యనూ కేకలువేశారు. ఆయన క్షణకోపి మరుక్షణంలో ఆయన మెత్తపడిపోయారు. 'అవున్లే ఎక్కడ ఉన్నానో మీకు తెలియదుగా — పోనీ ఏదైనా ఉపాయం ఆలోచించ బోయారా' అంటూ ఆదుర్దాపడ్డారు. "మీరు చెప్పేదాకా నాకూ తెలియ దండీ" అంటూ మరింత గాభరాపడుతున్న భార్యను "ఏమే ఏంచేద్దామే. నువ్వయినా చెప్పవే" అంటూ మళ్ళీమళ్ళీ అడిగారు ఆయన.

మాధవయ్యగారు మళ్ళీ అతని గదిలోకి వచ్చి "ఎలా ఉందిరా" అని అడిగారు. అతను మూలుగుతూ సంజ్ఞచేసి బాధ తెలియచేశాడు. ఒక నిముషం అతనిదగ్గర కూర్చుని, రొమ్ముమీద నిమురుతూ ఆత్రినివంక ఆర్ద్రంగా, ప్రేమగా చూస్తూ "అంతబాధగా వుందేమిట్రా" అంటూ ఆదుర్దాపడ్డారు. అంతలో దాను విషయం తెలుసుకొన్న తర్వాతకూడా అన్ని నిముషాలు—దాదాపు పదిహేను నిముషాలు గడిచిపోయాయని స్ఫురణకు వచ్చింది ఆయనకు. ఆయన వెంటనే బయటకు పరిగెత్తారు.

హఠాత్తుగా ఏదో ఆశాభావం హృదయంలో మెరుపులా మెరసి, ఏదో చిన్న ఉపాయం సమయానికి తోచి, ఆయన అలా పైఉత్తరీయం అయినా వేసుకోకుండా, కాళ్ళకు చెప్పులైనా తొడుక్కోకుండా, ఉన్న పళంగా బయలుదేరి, వైద్యుని ఇంటికి పరుగుతీశారేకాని ఆయన మనసు వెనక్కులాగింది. అసలు—ఆయన మనిషిముందుకు—అతన్ని అక్కడలా విడిచిపెట్టి—వెళ్ళారేకాని మనసు అతనిదగ్గరే ఉన్నది. ఆయన అతని విషయం అంత గాభరాపడడానికి వాస్తవానికి అతను తనవైపుగానీ భార్యవైపుగానీ బంధువువేమీ కాదు. కాని ఆయన అలా చలించిపోయారు.

o o o o o

అప్పటికి అవధాని వయసు పదిహేను సంవత్సరాలు. సుమారైన ఎత్తు. కుఱ్ఱవాడు చక్కపల్చన. అతనిది గట్టిఒళ్ళు. పనికి బద్ధకించేవాడు

కాదతను. అందుకే అతని ఒళ్లు గట్టిపడ్డది. కాలం ఎంతగడ్డుగా గడచినా అతను గత నాలుగు సంవత్సరాలలోనూ నాలుగు అంగుళాలు ఎత్తు ఎదిగాడు. మెట్టుపైమెట్టు ఎక్కుతూ ఉన్నత పాఠశాలా విద్యాధ్యయనం కొనసాగిస్తున్నాడు. మరో నాలుగేండ్లలో మరో నాలుగు అంగుళాలు ఎదక్కపోడు. కొంచెం ఒళ్ళూ రాకపోదు. అంతేకాదు గతంలో పోకడ దృష్ట్యా అవకాశాలు లభిస్తే అతను అన్ని విషయాలలోనూ పైస్థాయికి వెళ్ళగలడనే అనిపిస్తుంది ఎవరికైనా.

తలిదండ్రుల చాటునఉంటూ నిక్షేపంలా పాతికేండ్లు పైబడి, మీసాలు బారెడుపెరిగి, గడ్డం ముదిరేదాకా ఏ చదువో ఓ చదువు వెలగ బెడుతూ, బస్తీలలో కాలం గడుపుతూ, ధనంవిచ్చలవిడిగా వ్యయంచేస్తూ మూడుపూటలా సుష్టుగా తిని యధేచ్ఛగా తిరిగే 'అదృష్టం' కొందరికే ఉంటుంది పరిమితమై. ఆ కొందరిలో అవధాని ఒకడుకాడు. దిక్కూ దివాణం లేకుండా ఎక్కడో ఏకాకిగా పెరిగి, అక్కడా ఇక్కడా వెట్టి వెంగళప్పలా తిరిగి స్వయంకృతాపరాధంవల్లనో, విధివశాననో జీవితం భ్రష్టం అవుతుండగా పాడుజీవితాలు గడుపుతూ,కొద్దోగొప్పో పైకివచ్చినా పైకి వచ్చినట్లే అనిపించక, ఏ కొంతకాలమో సుఖపడ్డా సుఖపడినట్లే అనిపించక, చివరకు ఎక్కడో ఏమూలనో కూలి రాలి పోయేవాళ్ళు మరికొందరు ఉంటారు. ఈ కొందరిలోనూ అవధాని ఒకడుకాడు.

అతనికి తల్లి, తండ్రీ ఉన్నారు.

అతను సుష్టుగాతిని తిరగనూలేదు. ఏ విషయం పట్టించుకోకుండా ఇష్టానుసారంగా ఊరేగనూలేదు. కొందరు ఇతరులంతా అలా చూస్తుండ గానే అతి సులభంగా అసలు ఏ ప్రయత్నం లేకుండానే అత్యున్నతస్థాయి అందుకొంటారు. కొందరు అమితోత్సాహంతో వెనుకముందులు చూచుకో కుండా మహాప్రవాహంలా ముందుకు తోసుకొనిపోతారు. వారిలో కొంత

మంది బాగా బాగుపడతారు. కొందరు నెమ్మదిగా భారంగా సింహాచలం కొండ మెట్లు ఎక్కినట్లుగా నడుస్తారు. అవధాని కొంతదూరం ప్రయాస పడుతూ నిస్పృహ, ఈర్ష్య వెంటరాగా 'ఏం కొండమెట్లు ఎక్కపోతేనేం పుణ్యమా పురుషార్ధమా' అనుకొంటూ ఏదో తప్పనిసరి అయినట్లు ఎక్కేతైర్ధికునిలా జీవితంలో మెట్లు గడిచాడు. అలా నడుస్తూనడుస్తూ ఒక మలుపులో – ఆ మలుపు తిరిగీతిరగ్గానే పరుగు అందుకొన్నాడు. అతని నడకే చిత్రమనిపించింది అందరికీ. అతను ఎప్పుడూ ఆరోగ్యంగా కన్పించేవాడు. కుఱ్ఱవాడు పచ్చనిపసిమి, భాగ్యవంతులఇండ్లలోపుట్టి ఎండ కన్నెరుగకుండా పెరిగిన ఆడపిల్లలకు మల్లే కావలసినన్ని పాలూ త్రాగుతూ కోరినప్పుడల్లా గడ్డపెరుగూ వేసుకొని తింటూ నెయ్యి నూనే కొంచెం ఎక్కువ తగులగా మరీ మిసమిసలు పోయే మేని పచ్చదనం కాదది. స్వతహాగా, పుట్టుకతో వచ్చిన రంగు అది. అలా ఉండేవాడతను.

ఒక పని మొదలు పెట్టాక దాని పరిపూర్తికి పట్టుదల అవసరం అని మాత్రం ఆయన గట్టిగా అనుకొన్నారు. అందుకే ఆయన ఎన్నడూ ఎవరినీ ఆశ్రయించని మనిషి, తన చిన్ననాటి స్నేహితుడైన మాధవయ్యగారిని కలుసుకొని ప్రాధేయపడ్డారు. ఫలితంగా మాధవయ్యగారు అతనికి ఉండడానికి తన ఇంట్లోనే ఒక చిన్న గది ఇచ్చారు. పూర్వం అది మట్ల గది. స్నానాదికాలకు తనతోపాటే ఎలా సర్దుకుపోవాలో చెప్పారు. అతనికి తిండి గడపడానికి ఉపాయం చెప్పారాయన.

అవధాని తండ్రి అన్నింటికీ సరే అన్నాడు.

కొడుకు చేత సరే అనిపించాడు. ఆయన కొడుకును మాధవయ్యగారికి వప్పచెప్పి ఇంటికి తిరిగి వెళుతూ "సరే వీణ్ణి నీకు అప్పగించి వెళుతున్నా. ఇది నీకు భారమని నాకు తెలుసు. మన స్నేహితులలోనే కొందరు స్థితిమంతులుఉన్నారు. సహాయం చేయగల వారూ ఉన్నారు. కాని వాళ్ళ సహాయం వద్దు. నువ్వు కష్టం సుఖం తెలిసిన వాడివి.

ఇక్కడ ఉంటే వాడికీ కష్టం సుఖం తెలుస్తుంది. ఎన్నడో ఒకనాడు నీ ఋణం తీర్చుకొంటాను. అసలది ప్రశ్నే కాదనుకో. ఇది తీర్చుకో కలిగే ఋణం కాదనుకో, కాని మాట సామెతకే అంటున్నాను. నా మనసుకు ఏదో తృప్తి కలిగించుకొనేందుకు అంటున్నా. నువ్వు అనుకొంటు న్నట్టుగా అన్ని వారాలూ కుదిరి ఏదో ఒక విధంగా చదువుసాగుతుందా, సాగనివ్వు. అలా చదువు సాగుతుంటే వాడు ఎంత ఇబ్బంది పడినా పరవాలేదు. పడే కష్టమేదో ముందే పడితే మంచిది. చెడిబ్రతకడం మేలు నాలాగా బ్రతికి చెడడంకంటె. వాణ్ణి కాస్త దార్లో పెట్టు. ఇప్పట్లో వాడు సంపాదించి నాకు పెట్టవలసినస్థితి వాడికీలేదు. అటువంటి ఏస్థితి నాకూ లేదు. నేను ఏదో విధంగా ఇల్లు గడుపుకుపోతా. వాణ్ణి ఇక్కడఉంచుకో. వాడు మధ్యలో భయపడినా, బెంగపెట్టుకొన్నా, వాడికి తెలిసేలా ఒకటి మాత్రం స్పష్టంగాచెప్పు. ఒరేయ్ అప్పు ఇంటికి వెళ్ళి మాత్రం ఏం బావుకొంటావ్. ఇక్కడే ఎలాగో గడిపి గట్టెక్కు అని గట్టిగా చెప్పు. ఒక వేళ ఎన్ని విధాల ప్రయత్నంచేసినా ఇక్కడ ఈ చదువు సాక్కపోతుందీ బెంగలేదు. ఏదైనా పనిలో ప్రవేశపెట్టు. పోనీ ఎక్కడయినా అచ్చాఫీసులో చేర్పించి పని నేర్పించు. నాన్నాళ్ళకు పొట్టపోసుకొనే శక్తి వస్తుంది." అన్నారు. అలా ఎన్నో చెప్పి కొడుకును వృద్ధిలోకితీసుకొని వచ్చే బాధ్యత మాధవయ్య గారి మీద పెట్టి, ఆ గుమ్మం దాటి బయటకు వచ్చాక కళ్ళు గట్టిగా తుడుచుకొని, నడి ఎండలో పడి, చెకచెకా నడిచి వెళ్ళారాయన.

ఆయనకు కాళ్ళకు చెప్పులులేవు.

ఒంటి మీద చొక్కాలేదు.

పైన ఎండ మండి పోతున్నది. వేద పండితుడు కనుక ఆయన ఎండలో అలా వెళ్ళినా పర్వాలేదు.

మాధవయ్యగారు గుమ్మంలో నిలబడి కొంతసేపు ఆయన వంకా, ఆ తర్వాత ఆయన వెళ్ళిన దారివంకా చూస్తూ ఉండిపోయారు. తనూ ఆయనా చిన్నప్పుడు ఒకే గ్రామంలో ఉన్నారు. అప్పుడు తమ ఇద్దరికీ ఎంతో స్నేహం. బాగా బ్రతికిన కుటుంబం ఆయనది. వేదాలు పోసిన గాదెవారి ఇల్లు. వారింట్లో గాదెల నిండా ధాన్యంకూడా మూలుగుతుండేది. అయితే ఆ ధాన్యం ముక్కిపోయేదికాదు. దాన ధర్మాలకు ఆ యిల్లు పెట్టింది పేరు. ఎక్కడెక్కడినుంచో పిల్లలు గోచీ పెట్టుకోవడం చేతకాని వయసులో వారింటికి చేరుకొని విద్యాభ్యాసం చేసి, పండితులై పట్టు పీతాంబరాలు ధరించి, పట్టు శాలువలు కప్పుకొని సంతోషంగా వెళ్ళారు. అది ఒక నాటి స్థితి. ఆయన తండ్రి హయాంలో చివరిరోజుల్లో ఆస్తి కరిగి పోయింది. ఆయన హయాములో పరిస్థితి దిగజారింది. "వేదపండితులకు ఏ నాడో దక్కిన ఈనాం భూములు లాక్కున్నారు. పరిహారం ఇచ్చే ప్రశ్నే లేదని స్పష్టంగా చెప్పారు కూడా. అయితే ఆ తర్వాత గొప్ప జమీందారులు మొదలైన వారికి మాత్రం గుర్రపు పందాలలో మదుపు పెట్టేనిమిత్తం సౌమ్య ఉద్యమం క్రింద రాజ భరణాల పేరిట లక్షల కొద్దీ ధనం చిన్న మొత్తాలుగా అడగకుండానే ఇచ్చేశారు, ఉదారంగా.

అలా జరిగాక ఆయన పరిస్థితి మరీ అయోమయం అయిపోయింది.

మాధవయ్యగారు ఆయన పరిస్థితిని గురించే ఆలోచిస్తూ కొంత సేపు అక్కడే నిలబడి అవధాని విషయం భార్యతో చెబుదామని లోపలకు వెళ్ళారు

మాధవయ్యగారైనా ఏ మంత కలవాడుకాదు. మొదటి నుంచీ కూడా ఆయనది అతి సాధారణ కుటుంబం. ఆయన తండ్రి ఎప్పుడో స్వగ్రామంలోఉన్న పొలం పుట్రా అమ్ముకొని బస్తీచేరి కొంతలోకొంత బాగుపడ్డాడు.

మాధవయ్యగారికి ఇద్దరు ఆడపిల్లలూ వారి తర్వాత ఒక మొగ పిల్లవాడు. ఇంకా సంతానం కలిగే సూచన్లే కన్పిస్తున్నాయికాని, అప్పట్లో ఆగేలా లేదు ఆ వ్యవహారం. పైగా బస్తీ కాపురం. చేస్తున్నదేమో మాస్టరు గిరీ. ఆయన భార్య ఎంత పొదుపుగా వాడినా డబ్బు చాలేదికాదు. అంతంతమాత్రపు సంపాదన ఆయనది. అందువల్లనే ఆయన తను ఉంటున్నది, సొంత ఇల్లు కనుక అవధాని ఉండడానికి ముందువసారాలో ఉన్నగది ఇవ్వకలిగారే గాని అతనికి తానుగా భోజన సౌకర్యం కల్పించ లేక పోయారు. అటువంటి సదుపాయం కల్పించాలని ఆయన హృదయ పూర్వకంగా ఆశించినా స్తోమతులేక అతనికి వారాలు కుదిర్చి పెట్టారు. సంసార పక్షంగా తనూ ఒక వారం ఇచ్చారు.

అవధాని కూడా అట్టే అభిమానాలకు పోయే కుఱ్ఱవాడుకాదు. అందువల్లనే మాధవయ్యగారు. దారి చూపిస్తే ఆ దారిన తల వంచుకొని ముందుకు నడిచాడు. మనసులో ఏమనుకొన్నా, ఇదికావాలి అది కావాలని తానుగా అడిగి వేయించుకోక పోయినా ఆయా ఇళ్ళలో అతను కొంత తృప్తిగానే తినేవాడు. తనకు వారాలుకుదిరిన ఇళ్ళల్లోఆడవాళ్ళు ఏ సినిమా లకో వెళితే, ఇక అ పూట భోజనం చెయ్యకుండానే గదికి తిరిగి వచ్చి, పడుకొనేవాడు. ఒక పూటా ఒక రోజూ భోజనం లేకపోయినంత మాత్రాన అస్తవ్యస్తమైపోయి తోటకూర కాడలా వాడి వేలబడి పోయేవాడుకాదు. ప్రొద్దుట అన్నం తినకుండా వచ్చేసినా సాయంకాలం దాకా అతను బడిలో అందరికీ మామూలుగానే కన్పించేవాడు. అలా చాలా సార్లు జరిగింది. అతని ముఖంలో ఉపవాసపు లక్షణాలు ఎన్నడూ కన్పించేవికావు. అ సంగతి మాధవయ్యగారికే తెలిసేదికాదు. కాని అతను మనసులో మాత్రం అందుకు బాధపడేవాడు. బడిలో అనేకమంది ఇతర పిల్లలలాగా మూడు పూటలా తిని, ఇస్త్రీ మడతలు, క్రొత్త బట్టలువేసుకొని తనూ తిరగలేక పోతున్నందుకూ. వాళ్ళందరికీ ఉన్న

భోగం తనకు లేకపోయినందుకూ, అతనికి కొంత అసూయ కొంత నిస్పృహకలిగేవి. చిన్న వయసు కావటంచేతా దానటన చేతకాకపోవ టంచేత వాటిని పైకి కన్పించనీయకుండా దాచుకోలేకపోయేవాడు. అంతే కాదు. బడిలో గొప్పఇంటిపిల్లలు ఎవరైనా తన దుస్తులు చూచి కానీ, తన వాలకంచూచికానీ నవ్వినా, వెక్కిరించినా అతను ఎంత మాత్రం సహించే వాడు కాదు. మళ్ళీ నవ్వే వాడు, మళ్ళీ వెక్కిరించేవాడు. వాదులాటకు, దెబ్బలాటకు సిద్ధమయేవాడు. ఫలితంగా తీవ్ర అవమానాలకు గురిఅయేవాడు. మొదట్లోఇలా చాలాసార్లు జరిగింది. ఆ విషయాలు మాధవయ్య గారి దాకా వెళ్ళాయి. ఆయన అతన్ని పిలిచి గట్టిగా మందలించేవారు. "ఒరేయి వెట్టి వెధవయ్యా నువ్వు అలా ఉడుక్కోకూడదురా, అసూయ మంచిదికాదురా. ఎవరు ఏమన్నా సరే దెబ్బలాటకు పోకూడదురా. దానివల్ల మనకే నష్టం" అంటూ అనేక విధాల హితబోధచేసేవారు. కాని ఆ బోధలు అతనికి అప్పట్లో సమంగా అర్ధం కాలేదు,

ఆ సంవత్సరం నెలనెలా మాధవయ్యగారే తన జీతంలోనుంచి అయితేనేమి, దగ్గర మిత్రుల దగ్గర నుంచి విరాళాలు వసూలుచేసి అయితే నేమి అతని బడిజీతంకట్టి, చదవుకోడానికి పాతపుస్తకాలు సంపాదించి ఇచ్చి, బడిలోనూ ఇంటి దగ్గరా ఎలా చదువుతున్నదీ కనిపెట్టిఉంటూ అతనికి అన్ని విధాలా అండగా నిలిచారు.

అతికష్టంమీద ఆ సంవత్సరం గడిచింది.

అవధాని నాల్గవఫారంలోకి వచ్చాడు. బస్తీ జీవితానికీ బస్తీలో బడి చదువుకూ, వారాల భోజనానికీ,మాధవయ్యగారి కట్టుబాట్లకూ, అతను క్రమంగా కొంతలో కొంత అలవాటుపడ్డాడు. అవి కొంచెం కష్టమే అయింది." అతనికి ఇంటి దగ్గర పెద్దవాళ్ళ పరిస్థితి ఎలా ఉన్నా అతనికి మాత్రం అంతకాలం స్వేచ్ఛగా, సుఖంగా గడిచింది. బడికి వెళ్లినా

వెళ్ళకపోయినా ఎవరూ అడుగేవారుకాదు. ఇంట్లో తండ్రి దగ్గర సంస్కృతం బాగా నేర్చుకొన్నాడు. అక్కడబడిలోనేర్చుకోకుండానేకొత్తచదువు బాగానే అబ్బింది. తల్లీ తండ్రీ ఇద్దరూ కూడా గారాబమే చేశారు. అందువల్ల ఆతనికి అన్ని విధాలా హాయిగానేఉంటూ వచ్చింది. కాని ఇక్కడి పరిస్థితివేరు. అందువల్లనే క్రొత్త పరిస్థితులకు సర్దుకొని పోవటం కష్టమైంది అతనికి. అదీకాక ఆతనికి కొంత ఊహ వచ్చింది.

తనతోపాటు చదువుకొన్నవాళ్లు ఎవరో కొందరు బస్తీకి పోయి ఉన్నతపాఠశాలలో చేరారని తనూ అందుకు సిద్ధపడ్డాడు. మొదట వద్దన్నాడు తండ్రి. అతను పట్టుపట్టాడు. దానికి అతని తల్లి ప్రోద్బలం కూడా తోడు అయింది. అందుమీదట అవధాని తండ్రి అన్నివిషయాలూ జాగ్రత్తగా పరిశీలించాడు. చివరకు సరే అన్నాడు.

ఆలా చదువుకోసం బెజవాడ చేరిన మొదటిరోజులలో తరచు ఇంటికి వెళ్ళి తల్లినీ తండ్రినీ, చెల్లెళ్ళ తమ్ముళ్లనీ చూడాలని అనిపించేది. అతనికి బెంగగానే ఉండేది. పగలేకనుక వెళ్ళి మళ్ళీ మరునాడే తిరిగి రావచ్చుకూడా. కాని రానూ పోనూ బస్సుచార్జీలు కావాలి. అతనిదగ్గి డబ్బు ఉండేదికాదు. మాధవయ్యగారిని అడిగే ధైర్యంలేదు.

ఆయనంటే గౌరవంతోపాటు భయంకూడా ఏర్పడింది అవధానికి.

లోపల ఆయనంటే భక్తిభావం స్థిరపడది అతనికి. ఆయన భార్యకుకూడా ఆయనంటే భయం. అందువల్లనే భర్తచేసే పనులలో కొన్నింటిని చాటుగా విమర్శించినా, ఆయన ఇంట్లో ఉన్నప్పుడు నోరెత్తేది కాదు. ఆ విషయం గమనించాక అతనికి మాధవయ్యగారంటే భయం ఎక్కువ అయింది. అతనికి ఆయనంటేనేకాక ఆవిడంటేకూడా భయం ఉన్నది. ఒకసారి తను వసారాలో ఉండగా ఆవిడ మాధవయ్యగారితో "అతన్ని ఈ ఏడాది మరెవరి ఇంట్లో అయినా ఉండమందురూ'' అన్నది.

తన కూతురు పెద్దమనిషి కాబోతున్నదనీ, ముమ్ముందు ఆ గది కావలసి వస్తుందనీ, పరాయికుఱ్ఱవాడు ఉండడంవల్ల ఇబ్బంది కలుగవచ్చుననీ అనుకొంటూ,

అవధాని నెమ్మదిగా బయటకు జారుకొన్నాడు.

"చూద్దాంలే" అన్నారు మాధవయ్యగారు.

"చూద్దాంలే అంటే ఎలాగండీ? ఇల్లు చిన్నదయ్యె. నే నయితే నెలనెలా ఆ మూడురోజులూ ఎలాగో ఎక్కడో ఓచోట ఒదిగి కూర్చుని గడుపుకొస్తున్నా, పిల్ల ఎలా సర్దుకొంటుందీ?" అన్నది ఆవిడ పెద్ద సమస్య వచ్చిపడినట్లు

ఆయన నెమ్మదిగా "ఎలాగో సర్దుకోవాలి మరి. పొమ్మంటే ఎక్కడికి పోతాడూ? ఆయన పిల్లవాణ్ణి నాకు వప్పగించి వెళ్ళాడు. వాడూ మన యింటి పిల్లవాడులా మెలుగుతున్నాడు. నువ్వు అలా అనకూడదు మరి" అన్నారు ఆమెవంక అనునయంగా, బ్రతిమాలుతున్నట్టు చూస్తూ. కాని ఆవిడ వాదానికే సిద్ధపడ్డది. "మనకు వీలుకానప్పుడు ఎందుకీ లేనిపోని బెడద!" అనేసింది ఆవిడ వెంటనే.

మామూలుగా అయితే ఆయనకు కోపం వచ్చేదే. కాని ఆ సందర్భంలో అలా జరగలేదు. అందుకు కారణం ఉన్నది. తను శాంతంగా, మంచిగా మాటాడి, నచ్చచెబితే తన భార్యకూడా అతన్ని దయగా చూస్తుందని అనుకొన్నారాయన. అందుకే "తీరిక ఉన్నప్పుడల్లా వాడు మన పిల్లవాణ్ణి ఎత్తుకొని ఆడిస్తున్నాడు. చెప్పగానే బజారుకు వెళ్ళి కూరలవీ తెస్తున్నాడు. బడినుంచి సాయంత్రం ఆటలకు పోకుండా సరాసరి ఇంటికి వచ్చి నువ్వు చెప్పిన పనులన్నీ చేస్తున్నాడు. జీతగాడుకూడా ఇంతలా పనిచెయ్య డనిపిస్తున్నది. ఇంటా బయటా బుద్ధిగా మసులుకొంటున్నాడు. అటువంటివాణ్ణి పొమ్మంటే బాగుంటుందా? నువ్వే చెప్పు? అదీకాక వా డిక్కడ లేకపోతే నీ కీ పనులన్నీ ఎవరు చేస్తారూ?" అని అడిగారు.

"సరే, మీ యిష్టం. ఉంచుకోండి" అన్నది ఆవిడ మూతివిరుస్తూ. తనమాట నెగ్గడంలేదని కోపం వచ్చింది ఆవిడకు. ఆ మాటకు అయనకూ కోపం వచ్చింది. ఎఱ్ఱగా చూచారు. ఆవిడ వెంటనే అవతలకు వెళ్ళి పోయింది రుసరుసలాడుతూ.

మాధవయ్యగారి పట్టుదలవల్ల ఆ యేడుకూడా బాగానే గడిచి పోయింది. కోప్పడినప్పుడు కోప్పడినా, ఆయన అతన్ని ప్రేమగానే చూచారు. అడగకుండానే అతనికి చిల్లరడబ్బులు ఇచ్చేవారు. జేబులో డబ్బులు ఉన్నరోజున అతను బడిలో ఇతర పిల్లలలాగా తనూ అక్కడికి అమ్మవచ్చే చిల్లిగారెలూ, జంతికలూ కొనుక్కొని వాళ్ళ అందరి ముందూ, వాళ్ళు తన్ను రోజూ ఊరించినట్లే తనూ వాళ్ళను ఊరిస్తూ, తినేవాడు. తనదగ్గర డబ్బులు లేనప్పుడు వాళ్ళకు దూరంగా పోయి వాళ్ళ కంటె తను బీదవాణ్ణికదా అనుకొని బాధపడేవాడు. వాళ్ళనుచూచి ఈర్ష్య పడేవాడు. సెలవలు ఇచ్చి ఇవ్వగానే ఇంటికి పరుగెత్తాడు. ఆ సెల వలలో మాధవయ్యగారు గట్టిగా ప్రయత్నించి అతనికి పాఠశాలా నిర్వాహక వర్గం ఇచ్చే ఉపకారవేతనం సంపాదించారు.

అవధాని అంత తాపత్రయపడి ఇంటికి వెళ్ళాడేగాని అక్కడ పరిస్థితులూ బాగాలేవు. ఎన్నడో అతని అక్క పెండ్లికి చేసిన అప్పు సగమైనా తీరలేదు. ఆ పిల్లను ఏ పండుగకూ తీసుకొనిరాలేకపోయి నందుకు అతనితల్లి బాధపడుతున్నది. సెలవలకు ఇంటికివచ్చాడని కొడుకును చూచుకొని ఎంతో ఆపేక్షపడ్డదేకాని – ఎంతో సంబరపడ్డదేకాని ఓ పిండివంటచేసి పెట్టుకోలేకపోయింది అతని తల్లి. గత సంవత్సరం కంటె ఆ యింటిపరిస్థితి దిగజారింది. కాని అతను సెలవలు నిర్విచారంగా గడిపాడు. తనకు మంచిబట్టలు కుట్టిస్తేనేకానీ వీల్లేదని అతను పట్టుపట్టాడు. అతనితండ్రి తన క్రొత్త ఖద్దరుపంచ చింపించి రెండు చొక్కాలు కుట్టించాడు. అవి తీసుకొని తల్లిదగ్గరకు పోయి కళ్ళనీళ్ళు

పెట్టుకొని, తనకు బడికి వెళ్ళడానికి ఒక్క జత అయినా మంచి రంగు బట్టలు కుట్టించమని అడిగాడు. ఎన్నాళ్ళనుంచో పసుపుకుండలో పడేసి ఉంచిన మెట్టెలు, పట్టాలు చాటుగా అమ్మించి కొడుక్కు క్రొత్త బట్టలు కుట్టించింది ఆవిడ.

బడి తెరుస్తున్నారనేసరికి అతనికి భయంవేసింది. స్వగ్రామం కంటె బెజవాడ ఎన్నోరెట్లు బాగున్నా, ఇంట్లోకంటె వారాల భోజనం మరింత రుచికరంగా ఉన్నా, అతనికి అక్కడికి వెళ్ళడం అంటే ఎంతో బాధ అనిపించింది. అందుకే ఒకటి రెండురోజులు ఆలస్యం చేశాడు. అతని తండ్రి అతికష్టంమీద ఎక్కడో పదిరూపాయలు తెచ్చి అతనిచేతికి ఇచ్చి "వెళ్ళు, నాయనా. ఆలస్యంచేస్తే మాధవయ్యగారికి కోపం వస్తుంది" అన్నాడు.

అంతకుముందు రోజుననే మాధవయ్యగారి దగ్గరినుంచి ఆయనకు ఉత్తరం వచ్చింది కూడా.

అవధాని ఆపూటే బయలుదేరి బెజవాడవచ్చాడు. అయిదవఫారం తరగతికి వెళ్ళి కూర్చున్నాడు. పాతవారాలలో రెండువారాలు పోయాయి. తను ఆలస్యంగా రావడంవల్లనే అలా జరిగిందని క్రమంగా తెలిసింది అతనికి.

క్రొత్తచోట మళ్ళీ ఆవారాలు సంపాదించడానికి పదిహేనురోజులు పట్టింది. వారాలు సంపాదించడం ఎంతకష్టమో తెలిసింది అతనికి. ఇంకా కొన్నివిషయాలు క్రమంగా తెలిశాయి. తను కేవలం మాధవయ్యగారి దయవల్లనే చదువుకొంటున్నాననీ, కష్టపడి చదవక తప్పదనీ, ఆ పరిస్థితులకు ఏదోలా సర్దుకొనిపోవడం తప్ప తనకు మరో గత్యంతరం ఏదీ లేదనీ అతనికి అర్థం అయింది.

మాధవయ్యగారివెంట సంచీపుచ్చుకొని బజారుకు వెళ్లేవాడతను. దారిలో ఆయన అతనికి ఇంగ్లీషువాక్య నిర్మాణంగురించి నూరిపోసేవారు. ఆయన అతనికి ఎక్కువ పనులు చెప్పేవారుకాదు. బడిలోకూడా తీరుబడి ఉన్నప్పుడు ఎక్కడో ఒకచోట కూర్చోపెట్టుకొని ఏదో ఒక పాఠం చదివించేవారు. కాని ఆయన భార్యమాత్రం అతన్ని ఊరికే కూర్చో నిచ్చేది కాదు. ఊరికే తిని ఇంట్లో ఉంటున్న పరాయివాడికి ఆ మాత్రం పనులు చెప్పి చేయించుకోవడం తప్పుకాదని ఆమె గట్టిగా అభిప్రాయ పడ్డది. అవధాని కిమ్మనకుండా ఆ పనులన్నీ చేసేవాడు.

పదిగంటలవల్లా అతను మాధవయ్యగారితో కలిసి బడికి వెళ్లే వాడు. వారాలు కుదిరిన ఇండ్లల్లో పదింటికి వంటకాలేనో, మరో ఇబ్బంది వల్లనో భోజనంచేసి రావడానికి వీలుకాకపోతే ముందు వేళకు బడికివెళ్ళి, మధ్యాహ్నం విశ్రాంతిసమయంలో తిరిగి అంతదూరం నడిచివచ్చి, గబ గబా అన్నంతిని మళ్ళా బడికి వెళ్లేవాడు. రాత్రి భోజనంకూడా తరచు ఆలస్యం అవుతూ ఉండేది.

అతను కొంచెం పెందరాళే వెళితే "అప్పుడేం ఏం తొంద రొచ్చిందయ్యా ఇంకా పసిపిల్లలకైనా పెట్టందే !'' అనేది ఒక తల్లి. కొంచెం ఆలస్యం అయితే "ఇపుడే గ్రాసపడుం వాలుద్దామనుకొంటున్నా. ఇంతలో నువ్వు తయారయావ్'' అంటుంది మరో ఇంటావిడ. వాళ్ళ మాటలు బాగా అర్థమవుతూ వచ్చాయి అతనికి క్రమంగా. అందుకు అతను బాధపడేవాడు.

ఆలా భోజనం ముగించుకుని అతను గదికి చేరుకుని బుడ్డీదీపం పెట్టుకుని ఈతఆకుల చాప మీద కూర్చుని చదువు మొదలు పెట్టే వాడు. అంత ఆలస్యంగా చదువు ప్రారంభించిన కొద్దిసేపటికే నిద్ర వస్తున్నట్లు అనిపించేది అతనికి. కునుకుపాట్లు పడుతుంటే మాధవయ్య గారు వచ్చి కేకలు వేసేవారు.

"ఏమిరా ఈ ఊరు వచ్చింది వారం భోజనానికా చదువుకా" అని అనేవారాయన కఠినంగా. ఒక్కొక్కసారి ఆయన అలాఅని లోపలకు వెళ్ళి లాంతరు తెచ్చుకొని, ఆ గదిలోనే కూర్చొని, కాంపోజిషన్ పుస్తకాలు దిద్దేవారు- అతన్ని ఏదో చదవమని చెప్పి. మరొక్కప్పుడు కూతుర్ని అక్కడకు పిల్చి ఇద్దరిచేతా లెక్కలు చేయించేవారు. పాఠాలు చదివించేవారు. ఏరోజూ రాత్రి పన్నెండు గంటలు కొడితేనేకాని అతన్ని నిద్రపోనిచ్చేవారు కాదాయన. బడిలోకూడా అతని చదువు విషయం తోటి ఉపాధ్యాయులను అడిగి తెలుసుకొనేవారు.

మాధవయ్యగారు ట్యూషన్లు చెప్పకపోవడంవల్లా, అన్ని విషయాలలోనూ నిక్కచ్చిగా ఉండడంవల్లా, బాగా చదువుకొన్నవాడనీ, నీతిమంతుడనీ, పేరు ఉండడంవల్లా, బడిలో అందరు ఉపాధ్యాయులకూ ఆయనంటే గౌరవం ఉంది. అందువల్లనే ఆయన అభిమానించిన అవధానిపట్ల వారుకూడా కొంచెం శ్రద్ధచూపడం జరిగింది.

మూడునెలల పరీక్షలలో అతనికి మార్కులు బాగానే వచ్చాయి. సెలవులలో ఇంటికి వెళతానంటే మాధవయ్యగారు వద్దన్నారు. అతను సరే అనక తప్పలేదు. పదిరోజులు సెలవులు వచ్చినా అతను ఇంటికి పోకపోవడం చూచి క్రొత్తగా వారం ఇచ్చిన ఒక ఇంటావిడ అతనికి వినిపించేలా "ఈ కుఱ్ఱవాడికి ఇంత తిండి దొరికితేచాలు ఇక ఇల్లూ వాకిలీ అక్కర్లేనట్లే ఉన్నదే" అన్నది. ఆవిడ ఎగతాళికే అన్నది. కాని అవధానికి కష్టం కలిగింది. ఇటువంటి ఎగతాళిమాటలూ, ఎత్తిపొడుపు మాటలూ అతనికి తరచు వినిపిస్తుండేవి. అతను ముఖం గంటు పెట్టుకొని ఇంటికి వచ్చేవాడు. అలాంటప్పుడు మాధవయ్యగారు "ఏరా అలా ఉన్నావేం?" అని అడిగేవారు. అతను వెంటనే సమాధానం చెప్పకపోతే "ఏంరా ఇంటికి పోవద్దన్నాననా? అంతేనా?" అని అడిగితే "కాదండీ" అనేవాడు అవధాని. దానిమీద పదిప్రశ్నలు వేసి మాధవయ్య

గారు అతని దగ్గరనుంచి సమాధానాలు రాబట్టేవారు. "ఊరికే తిని వాళ్ళ మీద పితూరీలు చెబుతున్నావా" అని కోపగిస్తారేమోనని భయపడుతూనే అతను జరిగినదంతా చెప్పేవాడు. అందుకాయన చిరునవ్వునవ్వి "ఓస్ ఆమాత్రానికే నువ్వు ఇంత ఇదవ్వాలా? కొంచెం విసుక్కొంటారు, ఎగ తాళికి ఏదో అంటారు. నువ్వు పట్టించుకోకూడదు. వంటమనిషి, పని వాళ్లూ ఉన్న ఇళ్లలో తప్ప ఇతరత్రా ఆడవాళ్ళు ప్రొద్దస్తమానం ఒళ్ళు విరుచుకొని పని చెయ్యవలసిందేనా? ఏవో ఓ మాట అంటే అది పెద్ద తప్పు విషయంకాదు. వాళ్ళు తమ పిల్లలను మాత్రం విసుక్కోరా కసురు కోరా. దానికి నువ్వింత బాధపడకూడదు తెలిసిందా" అనేవారు. అలా అని ఒకక్షణం ఆగి 'ఒరేయి వాళ్లు ఈమాత్రం దయచూపినందుకు నువ్వు కొంచెం కృతజ్ఞతగా ఉండాలి. మనుష్యులు అతిశీఘ్రంగా మారిపోతు న్నారు. పరాయివాళ్ళకి ఒకపూట అయితేమాత్రం ఎందుకు విస్త రెయ్యాలి? వెళ్ళి ఏ హోటలులో అయినా తినిరాకూడదా అంటున్నారు. అంతా వ్యాపార సరళిలో మాట్లాడుతున్నారు' అంటూ లోక పరిస్థితిని గురించి అవీ ఇవీ చెప్పేవారు. ఆమాటా ఈమాటా చెప్పి అతనికి ఉత్సా హం కల్పించి నెమ్మదిగా చదువులో పెట్టేవారు.

వారాలు ఇచ్చిన ఇళ్లల్లో ఆడవాళ్లే కాదు బడిలోకూడా అతన్ని కొందరు వెక్కిరించేవారు. ముఖ్యంగా గొప్పఇంటి పిల్లలు అతని దుస్తులు చూచి ఎగతాళి చేసేవారు.

అవధాని దుస్తులు తరచు మాపురంగులో ఉండేవి. అతనికి ఉన్నవే రెండుజతలు. ఒకజత ఉతికి ఆరవేసుకొని మరోజత కట్టుకొని బడికి వెళ్ళేవాడు. బట్టలు చాకలికి వేయకపోవడంవల్లా, పురపాలక సంఘంవారి దయవల్ల ఎన్నడో చెడిపోయిన రోడ్లమీద నుంచీ, ప్రక్కన కాలిబాటలమీదనుంచీ దుమ్మూ చెత్తా గాలికి లేచి బట్టలమీద పడుతుండడం వల్లా, అతను ఉతికి ఆరవేసుకొన్న చొక్కా, లాగూ ఆ తీరున ఉండేవి.

ఆ దుస్తులను చూచి పిల్లలు కొందరు నవ్వేవారు. అతను అటువంటి వాట న్నింటికీ బాధపడేవాడు. దీనికితోడు అతను తప్పనిసరిగా అడపాతడపా ఉపవాసం చెయ్యవలసి వచ్చేది.

వారం ఇచ్చిన ఇంటి ఇల్లాలు పిల్లలందరికీ సాయంత్రమే అన్నాలు పెట్టుకొని, అతని విషయం మరచిపోయి, ఏ సినిమాకో వెళితే, అతను భోజనం లేకుండా గదికి తిరిగివచ్చి, చదువుకొంటూ కూర్చుని ఏ తొమ్మిదో అయాక ఆకలివేస్తుంటే, పెట్టెలో దాచుకొన్న చిల్లర ఏ బేడో పావలో తీసుకొని, రోడ్డుమీదకు పోయి కేపలం బీదవాళ్ళకోసం చెట్టుక్రింద మురికి కాలవప్రక్కన తట్టలో పెట్టుకొని అమ్మే పునుగులూ, జంతికలూ కొను క్కొని అక్కడే నిల్చొని, ఎవరినా చూస్తున్నారేమోనని అభిమానపడి, భయపడుతూ చప్పున తినేసి, వీధి పంపుదగ్గర చేతులు కడుక్కొని, కడుపునిండా నీళ్ళు త్రాగి, గబగబా గదికి తిరిగి వచ్చి, మళ్ళీ పుస్తకం తీసుకొనేవాడు. ఒక్క అరగంటకూడా కాకముందే అతనికి మళ్ళీ ఆకలి వేస్తున్నట్టు అనిపించేది. "ఈ పూటకూడా మీ యింట్లోనే అన్నం పెట్టండి" అని మాధవయ్యగారి భార్యను అభిమానం చంపుకొని అడుగ లేకపోయేవాడతను. ఆకలినీ కాదనలేకపోయేవాడు. 'అభిమానం కన్న ఆకలి గొప్పది.' 'వెధవ ఆకలి' అని అతను పదిసార్లు అనుకొనేవాడు.

అంత కష్టపడి అర్ధాకలితో మాడుతూ అక్కడ ఆ చదువు చదవక పోతేనేం అనిపించేది అతనికి తరచు. 'అసలు నావంటివాడు ఉంటేనేం పోతేనేం? అనికూడా అనుకునేవాడు అవధాని. అలా అనుకొనేసరికి అతనికి కళ్ళనీళ్ళ పర్యంతం అయేది.

ఆ పరిస్థితి అప్పుడప్పుడు మాధవయ్యగారు పసికట్టేవారు. లోపల మనిషి కరిగి నీరయేవారు. పైకిమాత్రం మండిపడేవారు. ఏదో అర్థం లేకుండా, వాళ్ళనూ వీళ్ళనూ కేకలు వేసేవారు అతని గదిలో కూర్చుని.

ఒక్కొక్కసారి అంతా నిద్రపోయాక అతన్ని నెమ్మదిగా వంటయింట్లోకి తీసుకొని వెళ్ళి కడుపునిండా అన్నం పెట్టేవారు.

ఒక్కొక్కప్పుడు ఆయనకు అతని ఉపవాసం సంగతి తెలిసేది కాదు తెలిసినా ఇంట్లోకి వెళ్ళి పరిస్థితి తెలుసుకొని వచ్చిన తర్వాత తెలియనట్లుండేవారు.

ఆయన అతన్ని ఎరచు మందలిస్తూ ఉండేవారు కొంచెం మంద కొడిగా కన్పిస్తే. చిన్నతనంవల్లా, ఇల్లువదలి వచ్చి ఇక్కడ ఇబ్బందులు పడుతూ చదువుకోవలసి రావడంవల్లా అతను అలా కన్పిస్తున్నాడని అనుకొని ఆయన అతన్ని ఒక్కొక్కప్పుడు గట్టిగా కోప్పడేవారు. "ఒరేయి మనం తిండికోసం కాదురా బ్రతికేది. బ్రతకడానికి తింటున్నాం. అది గుర్తుంచుకో. ఒకపూట తినకపోతే మరేం ప్రమాదం లేదు. ఈ వారా ఆవారా రేపు తినవచ్చు. కాని ఓపూట చదవకపోతే కుదరదు ఈరోజు మళ్ళీరాదు" అనేవారు. అని తనూ ఓ పుస్తకం తెచ్చుకొని అతనిదగ్గరే కూర్చుని ఆరాత్రి చాలా ప్రొద్దు పోయేదాకా చదువుకొనేవారు. అతన్ని గట్టిగా చదివించేవారు.

పరీక్షకు అది ముఖ్యం ఇది ముఖ్యంకాదు అనే విచక్షణ లేకుండా అన్ని పాఠాలూ అతనిచేత వప్పగించుకొనేవారాయన. కూతుర్నికూడా పిల్చి ఇద్దరికీ ఇంగ్లీషు, తెలుగు వ్యాకరణం చెప్పి గట్టిగా చదివించేవారు. అతను ఎప్పుడైనా పాఠాలు సరిగా వప్పగించకపోతే "ఒరేయి మీ తాతా మీ నాయనావాళ్ళు వేదాలు తల్లక్రిందుగావల్లించేవాళ్ళురా. అటువంటివంశంలో పుట్టిన నువ్వు ఈ వెధవ ఇంగ్లీషు పాఠాలు, అరటి ఆవు తెలుగు పాఠాలూ వప్పగించలేవురా" అనేవారు. ఒక గంట తర్వాత ఆ పాఠం ఏదో రాక పోయిందా కొట్టినంత పని చేసేవారాయన,

అతను ఆ సంవత్సరం రాత్రిళ్లు చదివిన చదువే చదువు.

అవధాని ఆ యేడు అయిదవఫారం బడిమొత్తంమీద ప్రథముడుగా ఉత్తీర్ణుడు అయాడంటే అదంతా కేవలం మాధవయ్యగారి చలవేనని అంతా అనుకొన్నారు. మాధవయ్యగారి భార్య తనధోరణిలో 'అంత నూరిపోస్తే ఎవరైనా అలా ప్యాసవుతారు. అంతచేటు కష్టపడి అతనికి చెప్పకపోతే ఆ చెప్పేది ఎవరికైనా ట్యూషను చెప్పకూడదూ, మరో నాలుగుడబ్బులు వచ్చునుగదా' అనుకొన్నది.

ఆ యేడు సెలవలకు అవధాని ఇంటికి వెళ్ళలేదు. వేసవికాలం అంతా అక్కడే గడిపాడు. అక్కడ ఉండి డబ్బు సంపాదించాలని బుద్ధి పుట్టింది అతనికి. ఒకరు ఉపాయం చెప్పారు. పిల్లలకు ట్యూషన్లు చెప్పి అయిదు ఆరు తరగతుల్లో బళ్ళల్లో చేర్పిస్తే బాగా లాభిస్తుందని చెప్పారు. అతను అపనే చేశాడు. వారాలు కుదిరిన కొన్ని ఇళ్ళల్లో పిల్లలకు ఉచితంగా ప్రయివేటు చెబితే వారు అతనికి సెలవల్లోకూడా అన్నం పెట్టారు. అవికాక ఇతరత్రా కుదిరిన ట్యూషన్లమూలంగా సెలవలు ఆఖరుకు అతనికి అరవై రూపాయల ఆదాయం లభించింది. అతను సంపాదించిన ట్యూషన్లలో ఒకటి మరీ మంచిది. అనుకోకుండా వెంకటప్పయ్యగారింట్లో ఇద్దరు చిన్నపిల్లలకు ట్యూషనుచెప్పే అవకాశం దొరికింది అదీ బహు చిత్రంగా దొరికింది. అతను ఒకరోజు మధ్యాహ్నం భోజనంకూడా చెయ్యకుండా ఎండలో తిరుగుతూ వారింటికివచ్చాడు.ఆయన బయట నిల్చున్నారు. నిండైన విగ్రహం. ముఖంలో వర్చస్సు కొట్టవస్తున్నట్లు కన్పిస్తున్నది. అతను మొదట ఆయన్నుచూచి ఆశ్చర్యపడ్డాడు. అతను ఆయన దగ్గరకు వెళ్ళి వినయంగా నమస్కారంచేసి, క్లుప్తంగా తనువచ్చిన పని చెప్పాడు. ఆయన వెంటనే "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు చదివావా?" అని అడిగాడు. అతను లేదన్నాడు. "అయితే నువ్వు ట్యూషన్ ఏం చెబుతావయ్యా" అని పెద్దగా నవ్వారు. మళ్ళీ అంతలో "భోజనం చేశావా?" అని అడిగారాయన. అతను మళ్ళీ లేదన్నాడు. ఆయన పూర్వంకంటె పెద్దగా

నవ్వుతూ, "అన్నం తిననివాడవు పాఠం ఏం చెబుతావోయ్" అన్నారు. ఒకక్షణం ఆగి "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు చదవలేదంటివి - అన్నం తినలేదంటివి. మరి నువ్వు ఎందుకు పనికివస్తావ్? వెళ్లు వెళ్లు" అన్నారు. అతను వెనుతిరిగి పోబోతుంటే కొంచెం కోపంగా చూస్తూ, "అటుకాదు - ఇటువెళ్లి - ముందు భోజనం చేసిరా. తర్వాత మాట్లాడుకొందాం" అని గుమ్మంలోనుంచే "ఈ అబ్బాయ్ వస్తున్నాడు, త్వరగా వడ్డించండే!" అని ఆయన మేడపైకి వెళ్లిపోయారు.

అవధాని అక్కడ ఎవరో దారిచూపిస్తే దొడ్లోకి వెళ్లి, చప్పున మళ్ళీ స్నానంచేసి, మరెవరో మడిబట్ట ఇస్తే కట్టుకొని, లోపలకు పోయి, భోజనానికి కూర్చున్నాడు. అతను ఆరోజు వారింట్లో ఏదో శుభకార్యం జరిగిఉంటుందని అనుకొన్నాడు మొదట. తలవంచుకొని విస్తట్లో వడ్డించిన వన్నీ తింటూ నెమ్మదిగా అడిగాడు "ఏమండీ, మీ యింట్లో ఏమైనా శుభకార్యం జరిగిందా" అని. ఆవిడ నవ్వి ఊరుకొన్నది. ఆవిడ అతనికి ఎంతో ఆదరంగా అవీ ఇవీ మారు వడ్డించింది. అతను గబగబా తింటుంటే "అదేమి టబ్బాయ్, అంత తొందర దేనికి. ఏమైనా అర్జంటు పనుందా" అంటే, అతను నెమ్మదిగా తను వచ్చిన పనిచెప్పి ఆ విషయం ఆయనతో మాటాడవలసి ఉన్నదని చెప్పాడు.

ఆవిడ "సర్లే బాబూ, నిదానంగా తిను. రేపటినుంచి వచ్చి చెప్పు. పిల్లలు ఇద్దరికీ నువ్వే చెప్పు. స్కూళ్లు తెరిచాక ఆయనకు కన్పడు. నీకు ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడు వచ్చి మాయింట్లో భోజనం అదీ చెయ్యి. బుద్ధిగా చదువుకొని, పైకి వచ్చే పిల్లలంటే ఆయనకు ఎంతో ఇష్టం" అన్నదావిడ.

వారి ఒక్కఇంట్లో ట్యూషను చెప్పినందుకే ముప్పయి రూపాయలు వచ్చాయి. ఆయనభార్య అతనికి మంచి బట్టలుకూడా కుట్టించింది.

అవధాని కంటికి అలా సంపాదించిన అరవై రూపాయలు, అరవై వేలుగా కన్పించింది. ఆ డబ్బు పదిసార్లు లెక్కపెట్టాడతను. అందులో ముప్ఫయిరూపాయలు మాధవయ్యగారికి ఇచ్చి, మిగతా సొమ్ము తీసుకొని సరాసరి ఇంటికి వెళ్ళాడు. ఆరూపాయలన్నీ తల్లి చేతికి ఇచ్చాడు. ఇస్తూ, "అమ్మా ఈ ఏడు అక్కను పిలిపించి మంచి చీర పెట్టు" అన్నాడు. ఆమె "వద్దులేరా, నువ్వు ఖర్చులకు ఉంచుకో. ఇన్నాళ్ళు పిలపంది, ఇప్పుడుమాత్రం పిలవకపోతేనేం" అంటూనే డబ్బు తీసుకొన్నది. ఆవిడి ఆనందబాష్పాలు చూచి అవధాని ఉబ్బి తబ్బిబ్బు అయాడు.

అలా ఇంటికివెళ్లి, అతను స్వగ్రామంలో ఒక్క వారంకూడా ఉండలేదు. అతనికి దారిద్ర్యం అంటే బాగా అర్థంఅయింది. తలితండ్రుల పరిస్థితి చూచి అతను దిగాలుపడ్డాడు. ఆ స్థితిలో వాళ్ళకు సాయపడక పోగా, భారంగా ఉండటం ఇష్టంలేక, తల్లి ఇంకో రెండురోజులు ఉండరా అంటున్నా, వెంటనే బయలుదేరి, అవధాని బెజవాడ తిరిగి వచ్చాడు బరువెక్కిన హృదయంతో.

సెలవలలో ట్యూషన్లు చెప్పడంవల్ల ఆ అవసరం కలవారికి అతను పరిచయంఅయాడు. వారిలో కొందరు ఏడాదిపొడుగూతా అలా ట్యూషను చెప్పమన్నారు. అందుకు ప్రధానకారణం అంత చవగ్గా మరెవ్వరూ చెప్పకపోవడం. అవధాని అందుకు సిద్ధపడ్డాడు. కాని మాధవయ్యగారు అడ్డుపడి అతన్ని కొంచెం మందలిస్తూ, "నీ కిప్పటినుంచే డబ్బుయావ ఎందుకురా" అన్నారు.

"ఒరేయి అవధానీ నువ్వీయేడు చాగా కష్టపడి చదవాలి. నువ్వీ స్కూలుఫైనలు గడిచి గట్టెక్కావా, ఒక దారిలోకి వస్తావు. అందుకు మొదటినుంచీ దీక్షగా చదవాలి. ఆ ట్యూషన్లేమీ వద్దు. డబ్బుకు కక్కుర్తి

పతవోకు. ముందీ చదువుకానీ – అది తర్వాత చూచుకొందువుగాని''
అఖికూడా అన్నారాయన.

అతను "అలాగేనండీ" అన్నాడు. అలా అనక తప్పిందికాదు అతనికి.

ఆ సంపాదన—అతి స్వల్పమే అయినా – అది కొనసాగితే ప్రతి రోజూ మధ్యాహ్నం ఉపాహారం సేవించే 'భాగ్యం' కలిగేది అతనికి. అది లేకుండా పోతున్నందుకు అతను బాధపడ్డాడు.

ఆ యేడు మొదటి మూడునెలలూ గడిచాయి.

ం ం ం ం

నెలలు గడుస్తున్నా గడపక అట్టే ఆగిపోతున్నట్లు అనిపించింది అవధానికి. మాధవయ్యగారు ఎప్పటిలాగే అతనిపట్ల శ్రద్ధ, దయ చూపుతూనే ఉన్నారు. ఆయనభార్య వీలైనన్ని పనులు చెబుతూనే ఉన్నది. అడపా తడపా ఉపవాసం చేసినా, మొత్తంమీద వారాల భోజనంవల్ల అతనికి ఆకలి తీరుతూనే ఉన్నది. వెంకటప్పయ్యగారింట్లో ట్యూషను చెప్పకపోయినా, వారం అంటూ ప్రత్యేకింగా కుదరకపోయినా వారింట్లో రాజాన్నభోజనం కోరినప్పుడల్లా లభిస్తూనే ఉన్నది అతనికి. వారం ఇమ్మని ఆయన భార్యను అడుగుదామని అతను ఎన్నోసార్లు అనుకొన్నాడు కాని అంతవాళ్ళను ఇంత స్వల్పమైన సహాయం అర్థించకూడదని అతను నిశ్చయించుకొన్నాడు. దానికితోడు ఆవిడ ఒకటి రెండుసార్లు అతని పరిస్థితి విచారించి "నువ్వీ సంవత్సరం మంచి మార్కులు తెచ్చుకొని ప్యాసుకా. ఆయనకు చెప్పి, నీకు పై చదువుకు సహాయం జరిగేలా చూస్తాను'' అని అన్నది. కాని ముందు ఆ సంవత్సరం ఎలా గడుస్తుందా అని అతను భయపడ్డాడు. అందుకు మొదటికారణం ఆకలి. ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం ఎప్పుడుపడితే అప్పుడు వేళా పాళా లేకుండా అతనికి ఆకలివేసేది. 'దరిద్రపు ఆకలి' అనుకొనే

వాడే తను తరచు: 'దరిద్రుడికి ఆకలి ఎక్కువ అంటారు. నిజమే నన్నమాట!' అనుకొని విసుక్కొనేవాడు అవధాని.

కొన్నాళ్ళ తర్వాత కేవలం అతని అదృష్టవశాత్తు అది కొంచెం మరుగున పడ్డది. ఇంటిదగ్గర మాధవయ్యగారి పోరుకు తోడు బడిలో అతని తరగతికి వచ్చే పంతుళ్ళ హడావిడి అతనికి బాధకం అయింది. వారంతా రకరకాల హెచ్చరికలు చేయడం మొదలుపెట్టారు. ఎవరికివారు తాము బోధించే విషయం ముఖ్యం అన్నారు.

ఇన్ని చేసినా, ఎవరు ఏమి అన్నా అవధాని నడక మందకొండిగానే సాగింది. తను అట్టే తెలివైనవాడు కాదేమోనని అతనికి అనుమానం కలిగింది. అతని కంటెకి తరగతిలో చాలా మంది పిల్లలు తనకంటె ఎక్కువ తెలివైన వారుగా కన్పించారు. తన్నువారితో పోల్చుకొన్నాడు. ఫలితంగా మరింత నిరుత్సాహం కలిగింది అతనికి. భాగ్యవంతుల పిల్లలు సహజంగా తెలివైన వారుగా, అందమైన పిల్లలుగా, శుచి శుభ్రత కలి వారుగా, ఎంతో బుద్ధిమంతులుగా పరిగణింప బడటం అతను గమనిం చాడు. వారిలో కొందరికి ఇంటి దగ్గర ట్యూషన్లు ఉన్నాయనీ, తమదగ్గర అలా చదువుకొంటున్న పిల్లలపట్ల ఉపాధ్యాయులు అభిమానం చూపు తుంటారని కొందరు పిల్లలు చాటుగా చెప్పుకోవడం కూడా అతను విన్నాడు. వారంతా పెద్ద పరీక్షలలో ఉత్తీర్ణులై తాను ఒక్కడే తప్పి పోతానేమోనని అతనికి భయం కలిగింది. ఆ భయంతో, సంకోచంతో అతను శ్రద్ధగా చదువుకోలేక పోయాడు. అందుకే అతను మాధవయ్య గారి చేత చీవాట్లు తినడం మరీ ఎక్కువ అయింది

*  *  *

ఆరోజు ఆదివారం కావడం చేత అవధాని భోజనం కాగానే గదికి వచ్చి పడుకొని పుస్తకం చదవడం మొదలుపెట్టాడు. మాధవయ్యగారు ఇంట్లో లేకపోవడం వల్ల అతను పడుకొని చదవడానికి సాహసించాడు.

ఆయనకు అన్నీ నియమాలే. పడుకొని చదవకూడదు. ఉదయం నాలుగు దాటాక పడుకో కూడదు. తనకు చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళకూడదు. సినిమా పేరే ఎత్త కూడదు. అతను మొదట ఆ విషయా లన్నీ ఒకసారిజ్ఞాపకం చేసుకొని పుటలవంక చూచాడు. కాని బుద్ధిపుట్టలేదు చదవడానికి. అతని మనస్సు ఎటో పరుగెత్తు న్నది.

'డబ్బులేనివాడు చదువుకోకూడదు. అసలు బ్రతకనే కూడదు. మొండిగా బ్రతికి మాత్రం ఏం ప్రయోజనం?...' అతను ఆలోచనలో పడ్డాడు. చదువుకోడానికీ, బాగుపడడానికీ అవకాశాలులేక హోటళ్ళలో అక్కడా పనిలో చేరిన తన ఈడు కుఱ్ఱవాళ్ళు, బస్సుల దగ్గర పని చేసే పిల్లలు జ్ఞాపకం వచ్చారతనికి. వాళ్ళ దారిద్ర్యం అతనికి కళ్ళకు కట్టి నట్లు అయింది. అతనికి కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. కష్టపడి చదువు కోకపోతే తన పరిస్థితీ అంతే అవుతుందేమో అనిపించే సరికి అతను బెంబేలు పడ్డాడు. "అబ్బెబ్బే నేను బాగా చదువుకుంటాను" అనుకొ న్నాడు వెంటనే. అంతలో మాధవయ్యగారి భార్య కేక విని, అవధాని ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు. రెండవ కేక వినిపించేలోగానే అతను ఆ గది గుమ్మం దాటాడు. గబగబా అతను చావడిలోనికి వెళ్ళి "ఏమి టండీ పిలిచారూ?" అని అడిగాడు వినయంగా. ఆవిడ ఒక చిన్న పని చెప్పింది.

ఆ గదిలో గోడలకు అక్కడక్కడ మేకులుకొట్టి పటాలు తగి లించాలి. అదీ అతను చేయవలసిన పని. ఎత్తైన ముక్కాలి పీట, సుత్తీ, ఆవిడ చేతికి ఇచ్చిన కొత్త మేకుల పొట్లం తీసుకుని ఆలస్యం చేయ కుండా అతను పని మొదలుపెట్టాడు.

ఒక్కొక్క పటానికి-పై వైపున ఒకటీ, క్రింది వైపున కొంచెం ఎడంఎడంగా రెండేసి మేకులుకొట్టి పటాలు తగిలిస్తున్నాడు. పటాలకు పై

వైపున కొక్కాలకు ట్వైనుదారం కట్టి ముందుకు వాలుతూ ఉండేలా వాటిని వేలాడతీశాడు.

చిట్టచివరి పటం కోసం అలా మేకులు కొడుతుండగా ప్రమాదం జరిగింది. క్రింద ఉన్న పొట్లం నుంచి మూడు మేకులు తీసుకొని ముక్కాలి పీటమీద ఎక్కాడు. ముందు క్రింద వైపు రెండు మేకులూ కొట్టడానికి సిద్ధమయాడు. ఒక మేకు కొట్టాడు. రెండో మేకు చేతిలో పట్టుకొని, మరో మేకు పెదిమలతో గట్టిగా నొక్కి పట్టుకొని క్రింద వైపున రెండో మేకు కొడుతుండగా పైనుంచి జారి బల్లి అతని నెత్తి మీద పడ్డది. అతను అనవసరంగా ఖంగారు పడ్డాడు. ఒక్కసారి తల వెనక్కి విసురుగా విదలించుకొని, నెత్తి మీద పిండిముద్దలా పడ్డ బల్లి దూరంగా పడేలా చేశాడు. ఆ సమయంలో నోట్లో పెదిమల మధ్య అర అంగుళం మేకు ఉన్నదనే విషయం అతనికి జ్ఞాపకం లేదు. అతనికి అసలు ఆ స్ఫురణే లేదు. నున్నగా, తెల్లగా, వెండిలా మెరుస్తున్న ఆ మేకు అతనికి తెలియకుండా, తల విసిరినప్పుడు అంగిట్లో పడి చప్పున లోపలకు జారిపోయింది, కాని అది మింగినట్లే అనిపించలేదు అతనికి. అది అలా జరిగిపోయింది. కొన్ని క్షణాల తర్వాత అతనికి తల తిరిగి నట్లు అనిపించింది? క్రిందకు దిగాడు. ఇంతలో మేకు విషయం జ్ఞాపకం వచ్చింది. వెంటనే అనుమానం కలిగి 'అసంభవం, అది గొంతులోకి ఎలా పోతుందీ? !' అనుకొంటూ ముందుకు వంగి అటూఇటూ చూచాడు. మేకు కన్పించలేదు. మేకులు ఉన్న కాగితం పొట్లం గాలికి నేలమీద ప్రాకుతోంది. అతను చావడి అంతా కలయచూచాడు. పొట్లంతీసి చూచి, చేత్తో నలిపి దూరంగా పారేశాడు. మళ్ళా ఆ కాగితంతీసి, మడతలువిప్పి చదునుచేసి 'ఛ' అనుకొంటూ చింపి అవతల పారేశాడు.

మొదలుపెట్టిన పని పూర్తి కాలేదు. అదే చిట్టచివరి మేకు. ఒక

వంక అనుమానం పీకుతున్నది. మరొక వంక ఆవిడ ఏమంటుందో అన్న భయం కలిగింది. ప్రక్కగదిలో ఉన్న ఆవిడకు వినిపించేలా 'ఆ పటం తర్వాత తగిలిస్తానండీ' అని చెప్పి అతను చరచరా తన గదిలోకి వెళ్లాడు. మళ్ళీ అంతలో అతను అంత హడావిడిగా చావడిలోకి వచ్చాడు

అతనికి అనుమానం స్థిరపడ్డది. భయం అతన్ని వణికించింది. "మరి నొప్పి పుట్టలేదేమిటి?– గొంతులో అడ్డుపడలేదేమిటి?" అనుకొన్నాడు. మరుక్షణంలో 'పిచ్చి ప్రశ్నలు' అనుకొంటూ లోపలకువెళ్ళి మంచినీళ్ళు అడిగి గ్లాసు అందిపుచ్చుకొని, కొంతసేపు ఒక్కొక్క గుక్కె నెమ్మదిగా, తర్వాత ఒక్క క్షణంలో మిగిలిన నీళ్ళన్నీ గడగడా త్రాగేశాడు. 'మరి ఏమి అనిపించదంలేదే!' అనుకొంటూ అతను మళ్ళీ తన గదికి వచ్చి పడుకున్నాడు.

నిల్చోలేక, కూర్చోలేక, పడుకున్నాడతను. కాళ్ళు చేతులు అసహ్యంగా వణుకుతున్నాయి. అంత భయం అతను ఎన్నడూ ఎరుగడు. అతని కాక్షణంలో ఏదో వికారపెడుతున్నట్లు కూడా అనిపించింది. రొమ్ము నొప్పిగా ఉన్నట్లు, బాధ ఎక్కువ అవవుతున్నట్లు అనిపించింది. మూలిగితే ఆవిడ ఏమన్నా అంటుందేమోనని అతను నెమ్మదిగా బయటకు నడిచాడు. ఆ వీధి మలుపులో కిల్లీకొట్టు దగ్గర ఆగి, రెండుసోడాలు త్రాగాడు. కొంతదూరం ముందుకు నడిచాడు అంతలో అలుపువచ్చింది. ఏమి అవాంతరం వస్తుందో అని మరీ భయపడి వెనుతిరిగి, గదికి వచ్చి వెల్లకిలా పడుకొని కళ్ళుగట్టిగా మూసుకున్నాడతను. లోపల ఆదుర్దా ఎక్కువ అయింది.

నిముషానికి ఓ ఆలోచన – క్షణానికో ఆలోచన భయపెడుతూ కారుమేఘాలను చీల్చుకొని దూసుకొనిపోయే మెరపులా మనసులో మెది

లింది. మనసు విచలితం అయింది. అతని మనోవీథిలో అకస్మాత్తుగా సుడిగాలి రేగింది. అది అంతలో చెలరేగింది. ప్రళయ ప్రభంజనాల విజృంభణలు - యమకింకరుల పోలిన వికృతరూపాలు తాల్చిన కారు మేఘాల కదలికలు - పట్టరాని ఔద్ధత్యంతో వరదవాగుల పరవళ్ళు - సంక్షోభం-నిరాశ - నిస్పృహ-నీరసం-మృత్యుభీకర కరాళ దంష్ట్రాగ్నుల విలయతాండవం - ఆతను ప్రత్యక్షంగా చూచినట్లే అనిపించింది. అతని హృదయం వికావికలు అయింది. ఒడలు కంపించింది. తల వేడెక్కింది. దిమ్మెక్కిపోయింది. నిట్టూర్పులు తనకే భరింతరానంత వెచ్చనయాయి. నరనరంలోనూ రక్తం గమనవేగం పదిరెట్లు పెంచుకొన్నది. నరాల ప్రతి మలుపులోనూ, ప్రతి రక్తనాళాల కేంద్రంలోనూ సుత్తిదెబ్బలు గట్టిగా వినిపించాయి. పది నిముషాలలో అమితనీరసం వచ్చింది. కొన్ని మైళ్ళదూరం ఎవరో తరుముతుంటే పరుగెత్తి వచ్చినట్లు అయింది. ముచ్చెమటలు పోశాయి. ఆ చిన్న మేకు అన్నకోశంనుంచి - చిన్న ప్రేవులను రెండుగా చీల్చుకొంటూ. గుండ్రంగా తిరుగుతూ నెమ్మదిగా ముందుకు సాగుతున్నట్లు అనిపించింది.

'ఈ పూటతో ఆఖరు ఈ దరిద్రుడు' అని ఎవరో గట్టిగా అన్నట్లే అనిపించింది అతనికి.

అతను పెద్దగా మూలిగాడు.

పనిమీద బయటకువెళ్ళి, తిరిగితిరిగి అప్పుడే ఇంటికివచ్చి చావడి లోకి వెళ్ళి, పది నిముషాలతర్వాత మాధవయ్యగారు అతని మూలుగు విని ఆ గదిలోకి వచ్చారు.

జరిగిన ప్రమాదం తెలుసుకొని ఆయన డాక్టరుకోసం వెళ్ళి తిరిగి వచ్చేసరికి ఆలస్యం అయింది. అతన్ని కదలకుండా పడుకోమని చెప్పి వెళ్ళారాయన. అతను కళ్ళు గట్టిగా మూసుకొన్నాడు.

మళ్ళీ అవే ఆలోచనలు.

o o o o o

అతనికి బ్రతుకుపై ఆశ కలిగింది. అపాయం వచ్చిపడుతున్న దేమోనన్న భయం ఎక్కువైనకొద్దీ అతనికి ఆ ఆశ పెరిగింది. ప్రాణం మీద తీపి తెలిసివచ్చింది అతనికి. ఎలాగైనా ఆ గండం గడచి బయట పడాలనే దృఢమైన ఆకాంక్ష, బలీయమైన వాంఛ కలిగింది. అంతలో దాన్ని బలహీనపరుస్తూ 'పోనీ పోతేమాత్రం ఏం ?' అని మరో ఆలోచన. అతను ఆ ఆలోచన వెలికిరాకుండా అణచివేశాడు. ఉండి ఏం సాధించాలి. పోతే సుఖపడిపోవూ' అని ఎవరో వికటంగా నవ్వుతూ అంటున్నట్లు అనిపించింది.

స్వగ్రామంలో కష్టంలో ఉన్న తలితండ్రులు, గత్యంతరంలేక బీదసంబంధం చేసుకొని దూరంగావెళ్ళిన అక్క, ఇక్కడ తనకు ఆశ్రయం ఇచ్చి, దారి చూపిస్తూ నెమ్మదిగా నడిపించుకొంటూ తను ముందుకు తీసుకొనివెళుతున్న మాధవయ్యగారు - జ్ఞాపకంవచ్చారు. దాంతోపాటు గడచిన జీవితం, పడినకష్టం, చదివిన చదువూ అన్నీ ఒకటి వెంట మరొకటి జ్ఞాపకం వచ్చాయి.

మరో కొద్దినెలలలో రాబోతున్న పెద్దపరీక్షల విషయం జ్ఞాపకం వచ్చింది. దాంతోపాటు మాధవయ్యగారు రోజూ అంటూవచ్చిన మాటలు అతని చెవులలో మారుమ్రోగాయి.

ఆ పరీక్ష ప్యాసయితే ఏదో చిన్న ఉద్యోగం- సంపాదన _ సుఖ జీవితం_తలితండ్రులకు సహాయం_పెండ్లి_సంసారం - సాగిపోయాయి అతని ఆలోచనలు,

ఆశలు అలా అల్లుకొనిపోయాయి. గండం గడవాలని బ్రతకాలనే ఆ వాంఛను ఆ ఆశాలతను భయంకరమైన, బుసలు కొడుతున్న, భయం అనే విషసర్పం చుట్టుకొన్నది. దానినుంచి తప్పించుకొని బయటపడాలని ఆ వాంఛ విశ్వప్రయత్నం చేసింది. అది ఒక్కసారి

పెల్లుబికింది. అది ఊటజలంలాగా ఉబికి ముందుకు ఉరకలుపెట్టింది. దారిలో మధ్యలో, కొంతనీరు ఇంకి ప్రవాహం ఆగి, వేగం కుంటుపడినా, వెనుకనుంచి నిరంతరంగా వచ్చి కలుస్తున్న జలధారల తోద్రోపులతో పరుగెత్తే వాగులా సాగింది ఆ వాంఛ.

అతను ఒకసారి ఉలికిపడ్డాడు. చప్పునలేచి కూర్చున్నాడు. ఎక్కడలేని ధైర్యం వచ్చింది. ఇక నాకేం వర్వాలేదనుకొన్నాడు. 'నేను చావను-నేను చావను' అని గట్టిగా, పెద్దగా అనుకొంటూ గదిలో అటూఇటూ తిరగడంకూడా మొదలుపెట్టాడతను.

మాధవయ్యగారు డాక్టరును వెంటపెట్టుకొని అక్కడకు తిరిగి వచ్చేసరికి అవధాని లేచి తిరుగుతున్నాడు. అతనికి గాభరా అంతా పోయింది. అపైగా అతను నవ్వుతున్నాడుకూడానూ.

"కదలకుండా పడుకోరా అంటే తిరుగుతున్నావేరా" అని మాధవయ్యగారు ఏస్తూనే అతన్ని కేకలువేసి "వీడేనండీ" అని వెంట వచ్చిన డాక్టరుకు చూపారు. ఆ వైద్యుడు అతన్ని పడుకోమని పది నిముషాలు పరీక్ష చేసి, ప్రశ్నలువేసి సమాధానాలు రాబట్టుకొని, ఇంట్లోకి వెళ్ళి, అన్నీ స్వయంగాచూచి, అంతా నిర్ధారణ అయాక అతన్ని ఆసుపత్రిలో చేర్పించారు. అంతకంటె గత్యంతరం లేదన్నారాయన.

ఆ వైద్యుడు తిరిగివెళుతూ మాధవయ్యగారితో "మనం చెయ్యగలిగింది చాలాతక్కువ. ఎక్సురేలుతీస్తూ జాగ్రత్తగా పరిశీలిస్తారు. పెద్ద డాక్టర్నికూడా కలుసుకొని చెప్పాను. అతను అదృష్టం బాగుంటే బ్రతుకుతాడు" అన్నారు. అవధానిని ఆసుపత్రిలో చేర్చి హడావిడిగా మాధవయ్యగారు ఒకసారి ఇంటికివచ్చారు. డాక్టరు అన్నమాటలు భార్యతోచెప్పారు. ఆవిడ మరింత భయపడ్డది. అతనిక దక్కడనే అనిపించింది ఆమె మనస్సుకు. అది కేవలం తనమూలకంగానే జరిగిందని అనిపించింది ఆవిడకు. 'నేను మొదటినుంచీ చెబుతూనేఉన్నా మనకు

ఎందుకొచ్చినబెడద అండీ అని. ఈయనగారు విన్పించుకొన్నారుకాదు. ఇప్పుడీపని జరిగింది. ఏమిటి చెయ్యడం' అని ఆనాడు మనసులోనే మథనపడ్డది.

ఆవిడ మనసు కరిగింది.

త్వరగా ఇంటిపనిముగించి, భర్తవెంట అసుపత్రికివెళ్ళింది. రాత్రి పది దాటింది. నర్సువచ్చి మాధవయ్యగారితో "ఇక మీరువెళ్ళండి. రాత్రిళ్ల రోగిదగ్గర ఇంతమంది ఉండడానికి వీల్లేదు. అసలు ఎప్పుడో పంపించ వలసింది మిమ్మల్ని" అన్నది. మాధవయ్యగారి భార్య "అవునండీ మీరు వెళ్ళండి. ఇంటిదగ్గర పెద్దవాళ్ళం ఎవరం లేకపోతే కష్టం" అన్నది. ఆయన నెమ్మదిగా బయటకువెళ్ళి. ముందుగదిలో ఉన్న డాక్టరుకు మరోసారి నమస్కారంచేసి, తన వివరం అంతా తెలియచేసుకొని ఆయనదగ్గర సెలవుతీసుకొని ఇంటికి తిరిగివెళ్ళాడు.

ఆవిడ ఆరాత్రి అంతా అక్కడే ఉన్నది. మేల్కొనే ఉన్నది. కొంతసేపు అతనిదగ్గర కూర్చున్నది. కొంతసేపు ప్రక్క వసారాలో నేలమీద గోడకు చేరబడ్డది. ఒకటి రెండుసార్లు కునుకువచ్చింది. 'అతను ఒకవేళ ఆక్షణంలో గుటుక్కుమంటే !' ఆ ఆలోచనరాగానే ఆవిడ ఉలికి పడ్డది. అదే జరిగితే అతనితల్లి ఎంతబాధపడుతుందో అని ఆవిడ కాసేపు ఆలోచించింది. అంతలో ఆ తల్లి శోకాలు స్పష్టంగా వినిపిస్తున్నట్లే అనిపించింది ఆవిడకు. ఆవిడకు గడచినకాలం జ్ఞాపకంవచ్చింది. తను అతనిపట్ల ఎలా నిర్దయగా, నిర్లక్ష్యంగా ఉంటూ వచ్చిందీ ఆవిడకు అర్థం అయింది.

ఒంటిగంట దాటింది. అతను మళ్ళీమళ్ళీ పెద్దగా మూలగడం మొదలుపెట్టాడు. లోపల ఎక్కడో మేకు కదలుతున్నట్లు అనిపించింది. మనసులో భయం పొదరింట కన్పించిన చిన్న పాముపిల్లలా మెదిలింది. అది మెలికలు తిరిగింది. అంతలో ఆభయం కొరివిదయ్యం అనిపించింది.

అది హృదయపీఠంమీదకు ఉరికి, వెట్టిగా చిందులు త్రొక్కుతున్నట్టూ, పీక నులుముతున్నట్టూ అనిపించింది అతనికి.

ఒళ్ళంతా పగలకొట్టుకొనిపోతున్నట్లు అనిపించింది అవధానికి.

అతను పెద్దగా మూలిగాడు.

ఆ మూలుగు విని ఆవిడ గబగబా లోపలకు వచ్చి "ఏమిటినాయనా మూలుగుతున్నావ్ ? బాధగా ఉన్నదా ?" అని మళ్ళీమళ్ళీ అడిగింది. అతను "అవునండీ" అని మాత్రమే అనగలిగాడు. ఆవిడవెళ్ళి నర్సును పిల్చుకొని వచ్చింది. ఆ నర్సు ఎక్కడ నొప్పి అని అడిగితే అతను చెప్పలేకపోయాడు. కాని అతనిబాధ, అతని పరిస్థితి అర్థం అయింది ఆ నర్సుకు. ఆమెవెళ్ళి డాక్టరును వెంటనే పిల్చుకొని వచ్చింది. గుమ్మంలో మాధవయ్యగారి భార్య చేతులు జోడించి "ఏమండీ డాక్టరుగారూ కుట్టువాడు చాలా బాధపడుతున్నాడు. మీరు అతన్ని కాపాడాలి" అన్నది ఆ డాక్టరుతో.

"ఆయన మీరు గాభరాపడకండి. మేం మొదటే చెప్పాంకదా. అంతా అతని అదృష్టంమీద ఆధారపడిఉన్నది న్యాయంగా అయితే ఇటువంటికేసు ఇక్కడ చేర్చుకోరు. ఏ విశాఖపట్నమో తీసుకొనివెళ్ళ మంటారు. ఇది మరీ చిన్నఆసుపత్రి. కాని తప్పనిసరై చేర్చుకొన్నాం" అన్నారు.

పెద్ద డాక్టరుకు ఒక ఉపాయంతోచింది. ఆయన గ్లిసరిన్ ఇచ్చారు ఆ సాయంత్రమే.

నర్సు, ఆ వచ్చిన డాక్టరూకలిసి అతన్ని మళ్ళీ మళ్ళీ పరీక్షించి మార్ఫియా ఇంజక్షన్లు ఇచ్చారు. భయంవల్లగానీ, బాధవల్లగానీ అనుకోని ప్రమాదం మరేమైనా రావచ్చునని ఆ డాక్టరు అలా మత్తు కలిగించే మందు ఇచ్చారు.

ఆ డాక్టరు సరిగానే ఊహించారు.

నిజానికి అతనికి బాధ కంటె వెయ్యిరెట్లు భయం కలిగింది. పాము కాటువేసిన మరుక్షణంలో మనిషిని నిలువునా ఊపివేసే భయం అది. దడదడలాడించి, కొన్ని క్షణాల తర్వాత గుండె కొట్టుకోకుండా నిలిపివేయగల భయం అది.

ఆ భయం అంతటిది.

ఆ డాక్టరుగారు ఆ పని చేయకపోతే అతను మేకు మింగటం వల్ల కాక కేవలం భయంవల్ల, హరీ అనే వాడేనని ఆ తర్వాత అందరూ అన్నారు.

బ్రతకడేమో అనుకొన్న అవధానికి ఆ గండం గడిచింది. ప్రొద్దుట ఆ మేకు బయటకు వచ్చేసింది. గడవదనుకొన్న ఆ కీర్తం రాత్రి గడిచింది, ఆ రాత్రి మాధవయ్యగారి భార్య అతనికి ఎన్నో విధాల పరిచర్య చేసింది. నర్సుకు అన్ని విధాలా సాయపడ్డది అందుకు ఆ నర్సు డాక్టరు ఆవిడను అభినందించారు. ఉదయం ఏడు గంటలకు మాధవయ్య గారు వచ్చి పరమానంద భరితులు అయారు. ఆ పూట పది గంటలకు ఆవిడ అవధానిని వెంటపెట్టుకొని బండి చేయించుకొని సంతోషంగా ఇంటికి తిరిగి వెళ్ళింది.

ఆ రోజు నుంచి ఆవిడ అతన్ని ఎంతో దయగా చూచింది.

జీవితంలో ఒక మలుపు ఉంటుంది

అందరి జీవితాలలోనూ ఉంటుందా మలుపు. అది వారి జీవిత మార్గాన్నే మార్చివేస్తుంది.

హఠాత్సంభవమైన విచిత్రమైన ఒకానొక సంఘటన కారణంగా వారు ఆ మలుపు చేరతారు. అక్కడ పెద్ద సంఘర్షణ, అగ్ని పరీక్ష. వాటికి తట్టుకొని ఆ మలుపు తిరిగినప్పటి మంచి కొందరు గబ గబా

మెట్లుఎక్కి పైకి వెళతారు. వారు అలా చూస్తుండగా ఇట్టే తారాపథం అందుకొంటారు. మరి కొందరు ఆ మలుపు దాటీ దాటగానే పడిపోయి క్రిందకు జారటం మొదలుపెడతారు. జారిజారి ఎక్కడో పడి రాలిపోతారు.

అవధాని జీవితంలో ఇలాంటి మలుపుదాటాడు.

అతనికి భయం పోయింది.

ఎంత కష్టం అయినా ఓర్చుకోవడం అలవాటు అయింది.

ఆ సంఘటన మూలంగా అతనిలో ఎవ్వరూ, ఎన్నడూ ఊహించని పరిణామంవచ్చింది. అతను అతి శీఘ్రంగా, ఎవరూ అనుకోని విధంగా అభివృద్ధిలోకి వచ్చాడు.

బ్రతకననుకొన్న తాను బ్రతికేసరికి, తన ప్రగాఢమైన ఆకాంక్ష ఫలించేసరికి, తన ఆశ నిజంఅయేసరికి అవధానికి ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. ఎక్కడలేని పట్టుదల కలిగింది. అతని జీవితం క్రొత్త పద్ధతిలో సాగంది దానికి క్రొత్త ఒరవడికలిగింది.

అవధాని ఆ సంవత్సరం స్కూలు ఫైనలు పరీక్షలో రాష్ట్రం మొత్తంమీద ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణుడు అయాడు.

పులుకడిగిన ముత్యంలా మెరిశాడతను.

నీళ్లు విదలించివేసిన మల్లెచెండులా అందరినీ ఆకర్షించాడతను.

అతనికి అందరి సహాయం లభించింది. వెంకటప్పయ్యగారి భార్యతో తను పరీక్షలో ఎంత మంచి మార్కులు తెచ్చుకొన్నదీ వివరంగా చెప్పుకొన్నాడతను. ఆవిడ, భర్తతో చెప్పి, అతను పై చదువులు చదువుకోడానికి సాయంచేసింది. వెంకటప్పయ్యగారు రెండో కంటికి తెలియకుండా అతన్ని పట్నం పంపి బి. ఏ. చదివించారు. ఆ విషయం మాధవయ్యగారికి చివరకు ఎప్పుడో తెలిసింది. బి. ఏ. కాగానే అతను తన కా చదువు చెప్పించిన వారి సిఫార్సుతో, ఒక పెద్ద వ్యాపార సంస్థలో

నెలకు అరవై రూపాయలు జీతం వచ్చే చిన్న ఉద్యోగంలో చేరి, గబగబా పైకివచ్చి, రెండు మూడు సంవత్సరాలలోనే నెలకు మూడు వందల ఆదాయం సంపాదించే పెద్ద ఉద్యోగి అయాడు.

ఒక రోజున హఠాత్తుగా అవధాని మాధవయ్య గారి ఇంటికి బుట్ట నిండా పండ్లు విలువైన కానుకలుపట్టుకొనివచ్చి ఆయనకు నమస్కారం చేస్తూ "మాస్టారూ మీ ఆశీస్సులు ఫలించాయండి. నా కిప్పుడు నెలకు మూడు వందలు జీతం వస్తున్నది." అన్నాడు.

మాధవయ్యగారు పరమానంద భరితులయారు.

ఆయన భార్య ఆయన కంటె ఎక్కువ సంతోషిస్తూ "ముందు ఇవన్నీ మీ అమ్మకూ, నాన్నకూ ఇచ్చిరాకపోయావా" అంటే అతను "వాళ్ళకు చాల కాలంగా ఇస్తున్నానండీ, పట్నంవెళ్లి ఇంటరులో చేరిన మరుసటి నెల నుంచీ సంపాదనకూడా మొదలుపెట్టాను'' అన్నాడు.

"ఎలా ఎలా'' అంటూ ఆవిడ ఆసక్తి కనపరచేసరికి అతను పట్నంలో తను ఎలా ట్యూషన్లు చెప్పిందీ, సెలవల్లో మారు మూల హోటళ్ళల్లో సర్వరుగా ఎలా పనిచేసిందీ, ఆడూళ్ళో వెంకటప్పయ్యగారు తను చదువుకొనడానికీ అంత పెద్ద పట్నంలో ఉండడానికీపంపిన డబ్బు ఎలా మిగుల్చుకొన్నదీ. తల్లికీ, తండ్రికీ, అక్కగారికీ, ఎప్పు డెప్పుడు ఎలా డబ్బు పంపిందీ వివరంగా చెప్పుకొనిపోతుంటే మాధవయ్యగారు అడ్డుకొని "ఇప్పుడెందుకు అవన్నీ జ్ఞాపకంచేసుకోవటం పైకి వచ్చావు మాకు అంతేచాలు'' అన్నారు సంతోషంగా చిరునవ్వు నవ్వుతూ.

*

# అదృష్టవంతుడు

"రాజమ్మా నువ్వు పెళ్లి కొన్నాళ్ళు పుట్టింట్లో ఉండిరా అమ్మా. అక్కడైనా ఈ దుఃఖం మర్చిపోగలుగుతావేమో—ఆ విషయం ఎలా ఉన్నా వాడి సంగతి మరీ అధ్వాన్నంగా ఉన్నది. వాణ్ణి మనం అదుపులో పెట్టలేకపోతున్నాం. వాడి చిన్న మేనమామ అయినా వాణ్ణి కాస్త అదుపులో పెడతాడేమో" అన్నారు సింహాద్రిగారు. అని కళ్ళనీళ్లు తుడుచుకొన్నారు. తుడుచుకొన్నా కన్నీరు ఆగలేదు. బుగ్గలూ, ఒళ్ళూ బూరెల్లా పొంగిపోయి, వాచిపోయి, ముఖం కందగడ్డయి ఎదురుగా దెబ్బలు తిన్న పొగరుబోతు లేగదూడలా మొహ వ్రేలాడ వేసుకొని నిలబడ్డ మనుమణ్ణి చూచేసరికి ఆయనకు దుఃఖం పొర్లివచ్చింది.

"వాణ్ణి అంత చేటు కొట్టావెందుకే రాజమ్మా?" అంటూ అతన్ని దగ్గరకు తీసుకోపోయారు.

కాని సుబ్బులు ఆయన దగ్గరకు పోలేదు.

పైగా వెనక్కు జరిగి నిలబడ్డాడు.

"పోనీ వాడికేం కావాలో ఇచ్చెయ్" అన్నారాయన.

"పాపిష్టి వెధవకు పొద్దున్నే పెసరట్లుకావాలట! ఎక్కణ్ణించితెచ్చి ఇవ్వను. అయినా వీడికీ పెంకెతనం ఏమిటి! అసలే చచ్చి నేనేడుస్తుంటే ఈ ముదనష్టపు వెధవకు పిండివంటలు చేసిపెట్టాలట. వీడు నా కడుపున పడ్డప్పుడే ఆయనకు క్షయవ్యాధి కన్పించింది. వీడు పుట్టాడు ఇక వరసగా అన్నీ అరిష్టాలే. వీణ్ణసలు ఏం చేసినా పాపంలేదు. చూడండి ఎంత

ఆగం చేస్తున్నాడో'' అన్నది రాజమ్మ కొడుకువంక ఇంకా కసిగా చూస్తూ.

ఈ తిట్లూ, వాడి అల్లరీ ఆయనకు క్రొత్తఏమీ కాదు.

మరోక్షణం తర్వాత సింహాద్రిగారు "ఒరేయి సుబ్బులూ నా వెంటరా. నీ కెన్ని కావాలో అన్ని పెట్టిస్తా" అన్నారు.

కాని సుబ్బులు కదలలేదు.

ఆయన మాటమీద వాడికి నమ్మకం కలగలేదు.

వాడికి కొంచెం ఊహ వచ్చిన తర్వాత పండుగలకు పిండివంటలు చెయ్యలేదు ఆ ఇంట్లో. కనీసం ఇంత బెల్లపు పరవాన్నం కూడా వాడికి కన్పించలేదు. ఎప్పుడూ ఏడుపులూ, పెడబొబ్బలూ. మాసికాలు వచ్చినప్పుడు సుబ్బులు దొరికినన్ని గారెలు మాత్రం తిన్నాడు.

దొంగతనంగానో, వంటవాళ్లను బతిమాలో, పెట్టకపోతే తాకుతానని బెదిరించో, ఓ రెండు గారెలుతింటూంటే వాడి నాయనమ్మ చూచి అసహ్యించుకొనేది. చావలేక బ్రతుకుతూ, బ్రతికి ఉన్నంతకాలం ఆవిడ వాణ్ణి తిట్టి పోస్తూనే ఉన్నది.

"నువ్వు పుట్టాక అన్నీ అరిష్టాలే. కొంపలో అందర్నీ మింగి పుట్టావురా రాక్షసపు వెధవా'' అని తిట్టిన మనిషి తిట్టినట్లే ఉండేది. వాడు పుట్టాక జరిగినవన్నీ ప్రతిసారీ ఏకరువు పెడుతుండేది.

రాజమ్మకు సూడిదలు జరుగుతున్నరోజున సింహాద్రిగారి కూతురు ఒంటెడు నగలతో ఎవరినో తీసుకొని లేచిపోయింది. రాజమ్మకు రేపు కాన్పు వస్తుందనగా సింహాద్రిగారి పెద్ద కొడుకు మద్రాసులో హోటలుగదిలో చనిపోయినట్లు టెలిగ్రాం వచ్చింది. సుబ్బులు అడుగులు వెయ్యడం నేర్చిన రోజున సింహాద్రిగారి పెద్దకోడలు వైధవ్యం అనుభ

షించడానికి ఆ త్తవారిల్లే కావాలా అని పుట్టింటికి వెళ్ళి, మళ్ళీ ఇటు తిరిగి చూడకపోవడమే కాకుండా మనోవర్తి దావా వేసింది.

సుబ్బులు నెమ్మదిగా అడుగులు వేస్తూ, నడిచి అన్ని గదులలోకీ వెళుతుంటే సింహాద్రిగారి భార్య వాడి ముఖం కన్పిస్తేనే మండిపడుతూ, అవతలకు తప్పుకొని తిరిగేది. సుబ్బులకు అయిదోఏడు వచ్చిన రోజున అప్పటిదాకా ఆ ఊళ్ళో పెద్ద ఆసుపత్రిలో క్షయవార్డులో ఉంటూ వచ్చిన వాడి తండ్రి ఇంక అక్కడ లాభం లేదన్నారని మదనపల్లి వెళ్ళాడు. ఆరో ఏడుకూడా దాటాక, వీణ్ణి కాస్త బళ్ళో వేస్తే నన్నా అల్లరి తగ్గుతుందేమో అనుకొని సింహాద్రిగారు ఏ హడావిడీ లేకుండా సుబ్బులును బళ్ళో వేశారు.

ఆరోజు వాడు రెండోపూట బడికి వెళ్ళడానికి వీలులేకపోయింది.

మధ్యాహ్నం ఇంటికి వచ్చేసరికి ఒకవంక తల్లీ, మరోవంక తాత, నాయనమ్మా పెద్దపెట్టున ఏడుస్తున్నారు. సుబ్బులుతో వాడి నాయనమ్మే చెప్పింది 'ఓరి శనిపాతకపు వెధవా మీ నాయనకూడా పొయ్యాడురా' అని.

రెండో కొడుకు పొయ్యాక ఆవిడ మంచంఎక్కింది. ఏడ్చి, ఏడ్చి, కటిక ఉపవాసాలుచేసి రోగం తెచ్చిపెట్టుకొన్నది. ఇటు చిన్నకోడలు చేతా, అటు ముసలి భర్తచేతా సేవ చేయించుకొంటూ మంచం దిగలేదు. మంచం దిగకుండానే పరలోకయాత్ర చేసిందావిడ.

ఆవిడ పొయ్యాక ఆ ఇల్లు మరీ బావురుమన్నది. ఆవిడ ఉన్నంత కాలం ఏడుపులూ, తిట్లయినా వినిపిస్తుండేవి. అవి కూడా వినిపించకుండా పొయ్యేసరికి ఆ ఇంట్లో భరించరాని నిశ్శబ్దం ఆవరించింది. ముందు గదిలో సింహాద్రిగారు మంచం దిగేవారుకాదు. శారీరకంగా లేచి తిరిగే

ఓపిక ఉన్నా, ఎప్పుడూ అక్కడే పడుకొనేవారు. ఆయన కోడలు వంట ఇంట్లో ఒక్కర్తే కుమిలి కుమిలి ఏడుస్తూ, ఏదో వేళకు ఇంత వండి పడేస్తూ ఉండేది.

అంత పెద్ద ఇంట్లో అలా ఉండడం ఎంతో కష్టమనిపించింది రాజమ్మకు. ఒకటి రెండు గదుల్లో తాముండి, మిగతా ఇల్లంతా భాగాల క్రింద అద్దెకు ఇద్దామనుకొన్నది. కాని వెంటనే ఎవరూ ముందుకు రాలేదు. పైగా సింహాద్రిగారు ఆయా గదుల తాలూకు జ్ఞాపకాలు అడ్డు వస్తున్నాయని అందుకు ఒప్పుకోలేదు.

"ఈ కుంకను చూచుకొనే నే నీ వెధవ బ్రతుకు గడపాలి కాబోలు," అనుకొని రాజమ్మ ఎప్పుడూ ఏడుస్తుండేది. కొడుకు కాస్త అల్లరి చేస్తే పట్టుకొని కొట్టేది. గారాబమన్నదివిరక్కపోయినా సుబ్బులు అల్లరి క్రమంగా ఎక్కువ అయింది. దెబ్బ భయం పోయింది. తిట్టు భయం వాడి నాయనమ్మ ఉన్నప్పుడే పోయింది. ఎన్ని తిట్టినా, ఎన్ని కొట్టినా అల్లరి మానేవాడు కాదు. కావాలన్నది ఇచ్చి తీరవలసిందే. ఎన్ని చెప్పినా, ఎన్ని కొట్టినా ఆ మాట మరచేవాడుకాదు. ఏడ్చేవాడూ కాదు.

సుబ్బులు ఒకసారి పంచదార పెట్టమంటే రాజమ్మ విసుక్కొని పొమ్మన్నది. కావాలని పట్టుపట్టాడు. ఆనాడు కొట్టింది, తిట్టింది. అన్ని దెబ్బలూ, అన్ని తిట్లూ తిని మళ్ళీ అదే కావాలన్నాడు. ఆవిడ కోపంగా ఒక్క విసురున వెళ్ళి ఆ డబ్బా తెచ్చి, వాడిముందు పెట్టి "బోర్లించుకు మింగరా" అన్నది. ఆ మాట అన్నదని సుబ్బులు డబ్బా ముందు నేలమీద బోర్లించి, కూర్చుని, బొక్కినంత బొక్కి, మిగిలింది పంట ఇల్లంతా విర జిమ్మి పోయాడు.

ఏది కావాలన్నా ఇదే తంతు. ఒక్కొక్కసారి సింహాద్రిగారు వచ్చి నాలుగు అంటించేవారు. అయినా అంతే. వాడి పట్టుదల మాత్రం

పడలేదికాదు. ఇన్ని జరిగాక కూడా చివరకు వాడు కోరింది తల్లే స్వయంగా ఇవ్వాలి.

వాడి వంటిమీద దెబ్బ వేసినప్పుడల్లా సింహాద్రిగారు తన గది లోకి వచ్చి, కంట నీరు పెట్టుకొనేవారు. తన పెద్ద కొడుకునూ, చిన్న కొడుకునూ తనూ, కూతుర్ని తన భార్యా ఎంత గారాబంగా పెంచిందీ జ్ఞాపకం వచ్చేది ఆయనకు. అంత పెద్ద ఉద్యోగంచేసి, అంత డబ్బు సంపాదించిన తన ఇంట్లో పుట్టిన ఈ కుర్రకుంక స్వల్పమైన——అతి చిన్న కోర్కె తీర్చలేకపోతున్నానే అని విచారపడేవారు. ఆ విచారంతో ఒకరోజున ఆయన సుబ్బులును ఏదో కారణంమీద కొడుతున్న రాజమ్మను వారించి, బలవంతాన వాణ్ణి తన గదిలోకి తీసుకొనివచ్చి డబ్బు ఇచ్చి బయటకువెళ్ళి ఏదైనా కొనుక్కోమని పంపారు.

ఇక అప్పటినుంచి సుబ్బులు ఆయన్ని వేధించడం మొదలు పెట్టాడు. తాతయ్యా రూపాయి ఇవ్వు——రెండివ్వు అంటూ. ఇప్పుడు కాదంటే ఊరుకోడు విసుగుపుట్టి ఒక దెబ్బ వేసేవారు ఆయన. ఒకటి కాదు పది దెబ్బలైనా తినేవాడేకాని అడిగిన ఆ రూపాయి ఇవ్వందే అవత లకు వెళ్ళేవాడు కాడు. ఏదైనా కొనుక్కొని తినడానికీ, ఏ పుస్తకమో కొనుక్కోడానికీ, చొక్కా కొనుక్కోడానికీ ఇదే పద్ధతి.

ఒకసారి రెండురూపాయలు అడిగాడు. ఆయన ఇవ్వనంటే ఇవ్వ నన్నారు. సుబ్బులు ఆవళంగా వెళ్ళి, డాబా ఎక్కి, అక్కడ నుంచి బావిగట్టు మీదకుదూకుతానని బెదిరించాడు. "దిగిరారా ఇస్తా" అని ఆయన అంటే— "కాదు ముందివ్వు దిగుతా'' అన్నాడు సుబ్బులు.

సింహాద్రిగారు నిచ్చెనఎక్కి డాబాపైకివెళ్ళి వాడికి ఆ రెండు రూపాయలూ స్వయంగా ఇవ్వవలసి వచ్చింది.

అప్పటికి సుబ్బులుకు పదో ఏడు.

సింహాద్రిగారు చెప్పగా చెప్పగా, రమ్మనమనందే ఎంత పుట్టిల్లైతే మాత్రం వెళ్లవచ్చునా— వెళ్లనా అనుకొని బాధ పడుతూనే, చివరకు పుట్టింటికి ప్రయాణమైంది రాజమ్మ. వంట మనిషితో చెప్పవలసినవన్నీ చెప్పి, తీరా బయలుదేరేవేళకు "సుబ్బులు" నేను రాను నువ్వుపో" అన్నాడు సింహాద్రిగారు. వచ్చి పది రూపాయలు ఇచ్చి అక్కడ నీకు బాగుంటుంది వెళ్ళమని ఎంతో నచ్చచెపితే తల్లి వెంట వెళ్ళాడు సుబ్బులు.

○ ○ ○ ○

అలా వచ్చిన వాళ్ళను చూచి గుమ్మంలోనే రాజమ్మ తల్లి ఒక వంక కూతురుకు జరిగిన అన్యాయానికి పెద్దగా ఏడుస్తూనే మరో వంక సుబ్బులును అంతకంటెపెద్దగా తిట్టిపోసింది. "ఈ శని వెధవను కూడా వెంట తీసుకొచ్చావెందుకూ: గొంతు పిసికి ఏ కాలువలోనో గిరాటేసి రాకపోయావా" అని అమాంతం వాడిమీదపడి "ఈ వెధవ పుట్టాడు, నా బిడ్డ మంగళసూత్రం తెగింది" అంటూ తలబొప్పికట్టేలా మొట్టికాయవేసింది. మంగళసూత్రాలు తీసేసేరోజున వచ్చివెళ్ళడం మళ్లీ తిరిగి చూడకపోయినందుకు రాజమ్మకు తల్లిమీద కోపం రాలేదుకాని ఆ విషయం ఒకసారి జ్ఞాపకంవచ్చేసరికి మనస్సుకు కష్టంకలిగింది. అంతలో ఆవిడ "ఈ వెధవమూలంగానే నిన్ను రమ్మనలేదే" అనే సరికి రాజమ్మకు తృప్తికలిగింది.

మరో నాలుగుదెబ్బలు పడేవేకాని ఇంతలో రాజమ్మ తండ్రి వచ్చి సుబ్బులును దగ్గరకుతీసుకొని, 'అదేమిటే వాణ్ణి కొడుతావ్! వాడేంచేశాడే పసి వెధవ' అని భార్యను వారించాడు. ఆయన నెమ్మదిగా వాణ్ణి అవతలకు తీసుకొని వెళ్ళేదాకా ఆ ముసలానిడ తిట్లవర్షం కురిపిస్తూనేఉన్నది.

విషయం అంతా విని రాజమ్మ చిన్నన్న "మామగారు అంత దుఃఖంలో ఉన్నారు కాబట్టిగాని లేకపోతే వీణ్ణి అదుపులోపెట్టడం ఒక

లెక్కా. నువ్వా. అమ్మా వాణ్ణి ఆ తిట్టడం మానెయ్యండి మిగతా సంగతి నేను చూస్తా'' అన్నాడు. ఆ మాటనిని రాజమ్మ తండ్రి సంతోషిస్తూ "ఒరేయి వెంకట్రావ్ నువ్వు వాణ్ణి బళ్లోచేర్పి కాస్త వాడికో రెండు ముక్కలు చెప్పరా వాడే బుద్ధిమంతుడవుతాడు'' అన్నారు.

బళ్ళో చేర్చినంతమాత్రాన సుబ్బులు అల్లరిమాని బుద్ధిమంతుడు కాలేదు.

బడికి వెళ్లి కొందరితో తగూలాడి, మరి కొందర్ని తన్ని ఇంటి మీదకు తగూలు తెచ్చేవాడు సుబ్బులు. వాడికి ఈ పల్లెటూరి బడే అన్ని విధాలా నచ్చింది. బడి వెనుక చింతతోపు, ఆ వెనుక మామిడితోట నాను కొని పంట కాలువ, అవతల పల్లపుభూములలో కొబ్బరితోట, అతని స్వేచ్ఛావిహారానికి అవన్నీ అత్యంత అనుకూలంగా కన్పించాయి. తుంటరి పిల్లలను వెంటవేసుకొని వెళ్లి మామిడితోటలో మామిడి కాయలుకోసి ముక్కలుకోసి, అందరికీవిందుచేసేవాడు. కాలవలో ఈతలు కొట్టి అవతలకువెళ్ళి కొబ్బరిబొండాలుకోసి, పచ్చి కొబ్బరితిని కొబ్బరి నీరు త్రాగేవాడు. పట్టుబడితే తా నొక్కడే దెబ్బలుతిని ఇంటికి చేరుకొనే వాడు ఆలస్యంగా.

ఇంత అల్లరిచేస్తున్నా వీడికి చదువు ఎల్లా వస్తున్నదా అని ముస లాయన ఆశ్చర్యపడితే, ఈకుర్రకుంక ఇన్ని దెబ్బలు ఎలా తింటున్నాడో అని వాడి చిన మేనమామ జాలి పడ్డాడు. జాలిపడి, అతను సుబ్బులుకు బాగా చనువిచ్చి, మంచిమాటలతో వశపరచుకొని, ఇంటిదగ్గర పాఠాలు చెప్పడం మొదలుపెట్టాడు. చెప్పినవి చెప్పినట్లు పప్పచెప్పాడు సుబ్బులు. పట్టుదలకలిగితే ఇంపైన లెక్కలైనా సరే ఒక్కసారి ఏక బిగిని చేసి చూపేవాడు.

ఆయనకు వాడిమీద అందుకే అభిమానంఏర్పడింది. వాడికి ఆయన మీద గురి ఏర్పడింది. తోటల్లో దొంగతనంగా కాయలుకోసి

తెచ్చి ఇచ్చాడు సుబ్బులు. డాక్టరు ఇంట్లో వాళ్ళకు ధైర్యం చెపుతూ, రోగికి మందులూ, ఇంజక్షన్లూ ఇస్తూ సాయంకాలం దాకా అక్కడే ఉండి అక్కడ కన్పించిన అందరికీ 'ఆంటీ టైఫాయిడ్ ఇంజక్షన్లు' ఇచ్చాడు.

అందరూ చేయించుకొన్నారు. కాని సుబ్బులు మాత్రం చేయించు కోలేదు. "ఏం నొప్పి పుట్టదురా— మేమంతా చేయించుకోలా, పైగా నువ్వు ఎక్కువగా వాడి దగ్గరే ఉంటున్నావు. కనుక నువ్వు చేయించు కోవడం అవసరంరా సుబ్బులూ'' అని తాతగారు బ్రతిమిలాడి చెప్పినా, "ఓరి వెధవయ్యా నీ కొస్తే ఎవరు చేస్తార్రా" అని వీపు మీద రెండు అంటించి తల్లి కొట్టి చెప్పినా, అంత జ్వరంలో ఉండే "సుబ్బులూ నువ్వు నా మాట వింటావు గదూ! ఆ ఇంజక్షను చేయించుకో" అని వెంకట్రావు నెమ్మదిగా చెప్పినా, డాక్టరు గారు గుడ్లురుమి భయపెట్టి చెప్పినా, వాడు విన లేదు.

"నా కక్కర్లేదు'' అన్నాడు సుబ్బులు.

"కుర్రవాడితో ఇంత వాదన ఎందుకు ఒక్కసారి గట్టిగా అలా పట్టు కోండి క్షణంలో ఇంజక్షను ఇచ్చిపోతా'' అన్నాడు డాక్టరు చివరకు విసుగుపుట్టి. కాని ఆ పని ఎవరివల్లా కాలేదు. ఆయన ఆ ఇంజక్షను ఇవ్వకుండానే వెళ్ళవలసి వచ్చింది చివరకు.

ఆ రాత్రి దగ్గర కూర్చుని నెమ్మదిగా కాళ్ళు పిసుకుతుంటే సుబ్బులును మరింత దగ్గరగా తీసుకొని వెంకట్రావు బుజ్జగిస్తూ ''ఒరేయి సుబ్బులూ! ప్రతిదానికీ అంత పంతం ఎందుకురా? నీకు నేనంటే ఇష్టం ఏర్పడింది. అందుకే నాకు జ్వరం వచ్చినా ఎప్పుడూ నా దగ్గరే ఉంటు న్నావ్. ఇదేమో అంటుజ్వరం. అంటే తెలుసా— ఒకళ్ళ నుంచి మరొ కళ్ళకు వస్తుంది. నా నుంచి నీకు రావచ్చు. అందుకని రేపైనా ఆ ఇంజ క్షను చేయించుకో'' అని ఆయాసపడుతూనే అంత వివరించి చెబితే సుబ్బులు "నాకు రాదు చిన మామయ్యా'' అన్నాడు. ఎన్ని విధాల

మాట మార్చి చెప్పినా వాడు అదే సమాధానం చెప్పాడు. ఆయన కూడా చివరకు విసిగి ఊరుకున్నాడు.

రోజు రోజుకు జ్వరం హెచ్చుతోందేగాని తగ్గుముఖం పట్టలేదు. డాక్టరు రెండు పూటలా వచ్చి వెళుతున్నాడు. ఆయనకు సుబ్బులు మీద క్రమంగా జాలి ఏర్పడింది. వాడి తరహా చూచి ఆయన ఆశ్చర్యపడ్డాడు కూడానూ.

మందు ఇవ్వాలంటే వాడే ఇవ్వాలి. ఒళ్లు తుడవాలంటే వాడే తుడవాలి. ముఖం కడుక్కోడానికి, ఆఖరుకు మలమూత్ర విసర్జనకు ఏర్పాటు చెయ్యాలన్నా సుబ్బులే చెయ్యాలి. మరొకళ్ళను చెయ్యనిచ్చేవాడు కాదు. అంతలో మళ్ళీ ఎంత జాగ్రత్త! ఎంత ఒడుపు! ఎంత ఓర్పు!

శిక్షణ పొంది, ఎంతో అనుభవంతోపాటు దయా దాక్షిణ్యాలు కల నర్సు కూడా ఇంత సేవ చెయ్యలేదు అనుకున్నాడు ఆ డాక్టరు. ఆ ప్రసక్తి డాక్టరు తెచ్చినప్పుడు వెంకట్రావు "కన్న తల్లి కూడా అసహ్యించుకోవలసిన పనులు వీడు మంచిపనిలా చేస్తున్నాడు! ఒక్క క్షణం విడిచిపోడు. ఏం కావాలి చినమామయ్యా అని అడిగినవాడు అడిగినట్టే ఉంటున్నాడు వీడు నిద్రపోవడంలేదు బొత్తిగా. మార్ఫియా ఐనా ఇవ్వండి'' అన్నాడు "నేనేం చేస్తే ఈ చిన్న సన్యాసికి నా రుణం తీరుతుంది'' అని మనస్సులో అనుకొంటూ ప్రక్కకు తిరిగి పడుకున్నాడు.

డాక్టరు ఆ గదిలో ఉన్నంత సేపూ ఎంత సేపైనా సరే సుబ్బులు అక్కడ గుమ్మంలో నిలబడే ఉండేవాడు. ఆయన వెళ్ళగానే దగ్గరకు వెళ్ళి వెంకట్రావుకు కాళ్ళు పట్టేవాడు. డాక్టరు చెప్పినట్టు నుదిటి మీద మంచుగడ్డలు నింపిన రబ్బరు సంచీ పెట్టేవాడు. సరిగ్గా వేళ ప్రకారం మందులు ఇచ్చేవాడు.

అర్ధరాత్రి దాటినా సరే ఆయన ప్రక్కలో కాస్త మెదిలితే చాలు సుబ్బులు మాట వినిపించేది "ఏం చిన మామయ్యా, నిద్ర పట్టలేదా?" అని.

అలా అదే పనిగా పరామర్శిస్తుండేవాడు సుబ్బులు. బొత్తిగా నిద్ర పోక, ఆరోగ్యం పాడు చేసుకొంటున్నాడని బాధ కలిగి వెంకట్రావు "అదే పడుతుందిలే—నువ్వు ఊరికే విసిగించక కాసేపు నిద్రపో" అనేవాడు కోపం వచ్చినట్లు నటిస్తూ, పెద్దగా.

వెంకట్రావు అలా ఒకటి రెండుసార్లు కావాలని విసుక్కొనేసరికి సుబ్బులు దగ్గరకువెళ్ళి "ఎందుకు చిన మామయ్యా నామీద కోపం వచ్చింది ?" అని అడిగాడు సుబ్బులు ఎంతో నెమ్మదిగా. దిక్కుముఖం పెట్టుకొని అలా అడిగేసరికి వెంకట్రావుకు జాలి వేసింది. అయినా ఇదే మంచి అవకాశం అనుకొని "అది కాదురా నువ్వు ఇల్లా నిద్రమాని నా దగ్గర ఉంటున్నావ్. పోనీ ఆ ఇంజక్షను చేయించుకోరా అంటే విన్నావా? రేపైనా చేయించుకోరా ఈ జ్వరం నీకు రాకుండా ఉంటుంది" అన్నాడు.

'అదా కోపం' అనుకొంటూ సుబ్బులు "నాకు రాదు చిన మామయ్యా" అన్నాడు వెంటనే.

"ఏం నువ్వు మాత్రం మనిషివి కావట్రా ? ఏమిటా మొండి ధైర్యం ?"

"అదికాదు చిన మామయ్యా, నాకు రాదు. వచ్చినా ఏం చెయ్యదు."

పెద్దవాడిలా అలా సమాధానం చెప్పేసరికి వెంకట్రావు మోచేతి మీద కొంచెం పైకిలేచి, వాడివంక నిదానంగా చూచి "అదేమిట్రా అలా అంటావ్" అన్నాడు ఆశ్చర్యపడుతూ.

"నేను..." అంతే సుబ్బులు మరేమీ అనలేదు.

ఆయన వాడి కళ్ళల్లోకి చూచాడు. వాడు చెప్పబోయిన విషయమంతా చెప్పినట్లే అనిపించింది. ఆయన ఒకసారి వాడి వంక పరీక్షగా చూచాడు.

'సుబ్బులు గుండులా ఉన్నాడు. వాస్తవానికైతే నిండా పన్నెండేళ్లైనా లేవుగాని పదహారేండ్ల యువకుడులాగా—గుర్రంలాగా ఉన్నాడు. ముఖం చూచి పసివాడు అనుకోలేరనిపిస్తున్నది. అంత చిరుత వయసులో కూడా ముఖంలో ఏదో కరుకుతనం కన్పిస్తున్నది.'

'ఒక్కసారి ఆ కళ్ళల్లో ఎంత గాంభీర్యం. ఆ లేత బుర్రలో ఎన్ని ఆలోచనలు మెదులుతున్నాయో! తన్నేమీ చెయ్యదట! అందర్నీ చంపి పుట్టావురా అంటూ మాటికీ మాటికీ అందరూ తిట్టగాతిట్టగా, వాడికి కూడా తను నిజంగా 'అటువంటివాడినన్న భావం కలిగింది. అందుకే తనకు ఏ రోగం, జ్వరం రాదనీ, వచ్చినా ఏమీ చెయ్యదనీ చేసినా మరేమీ ఫర్వాలేదనీ వాడి ఊహ.....ఎన్ని ఊహలు. మనసులో ఎంత బాధగా ఉందో! పెద్దవాళ్ళయి ఉండి కూడా వీళ్ళే ఎన్ని అన్నారో—జరిగిన అన్యాయాలన్నిటికీ వీడా బాధ్యుడు! ఎన్ని అని, ఎంత బాధిస్తున్నారో!' అనుకొంటూ వెంకట్రావు ఎంతో బాధ పడ్డాడు.

ఆయనకు కళ్ళు చెమ్మగిల్లాయి.

మరోక్షణంలో కన్నీరు ధార కట్టింది.

అది చూచి సుబ్బులు గాభరా పడుతూ, కన్నీరు తుడుస్తూ "అదేమిటి చిన మామయ్యా..." అని ఆగి, ఏదో అడగాలనుకొని అడగడం చేతగాక, అడుగలేక తికమక పడ్డాడు. తన మాట మూలంగానే ఆయనకు కష్టం కలిగింది అనుకొని అంతలో మాట మార్చి 'నిద్ర పట్టించుకో చిన మామయ్యా' అంటూ కాళ్ళు పిసకడం ప్రారంభించాడు. "వీణ్ణి బాగా చదివించి తండ్రిలేని లోపం తీర్చి పెద్దవాణ్ణి చేస్తా" అనుకొంటూ వెంకట్రావు నిద్రపోయాడు.

మరో వారం గడిచింది.

ఆ వారాంతంలో జ్వరం తగ్గింది. "మీ అందరి అదృష్టం మంచిది. కష్టకాలం గడిచింది. ఇక ఫర్వాలేదు. మరో నాల్గు రోజులు

చూచి పత్యం పెట్టొచ్చు. జ్వరం తగ్గింది. రెండు రోజులు వరసగా రెండు పూటలా నార్మలుకు వచ్చాక పత్యం పెడుదురుగాని'' అన్నాడు డాక్టరు. దాంతో అందరికీ ధైర్యం వచ్చింది.

కాని సుబ్బులుకు మాత్రం అటువంటి ధైర్యం కలుగలేదు. పైగా ఆయన వంక పూర్వం కంటె ఎక్కువగా భయపడుతున్నట్లు చూడడం మొదలుపెట్టాడు. బాగా నీరసించి పోయిన రోగివంక చూస్తూ, తన కేదో అనుమానం కలిగినట్లు, ఆ గదిలో ఎక్కడో ఏ మూలో దయ్యం దాగి ఉన్నట్లు, తాను అవతలకు వెళితే అది రోగిమీద పడుతుందేమో అన్నట్లు భయపడుతూ సుబ్బులు ఆ గది విడిచి బయటకు రాలేదు.

వాడి వింత ధోరణి, వాడి భయం ఎవరికీ అర్థంకాలేదు అర్థం చేసుకోవాలని ఎవ్వరూ ఒక్క రివ్వకూడా ప్రయత్నం చెయ్యలేదు 'పిచ్చి సన్యాసి ఏదో భయపడ్డాడు జ్వరం తగ్గదేమోనని' అనుకొన్నాడు వెంకట్రావు తండ్రి.

"రేపొక్క రోజు చూచి పత్యం పెట్టండి" అన్నాడు డాక్టరు.

ఆరోజు రాత్రి అందరూ నిశ్చింతగా పడుకొన్నారు. అర్ధరాత్రి వేళ అప్పుడే కునుకుపట్టిన సుబ్బులుకు కలలో ఎవరో మూలుగుతున్నట్లని పించి, చప్పున మెలకువ వచ్చింది. ఒక్క గంతున లేచి కూర్చున్నాడు. గదిలో ఎక్కడో మూలుగు సన్నగా వినిపించింది.

నెమ్మదిగా మంచం దగ్గరకు వెళ్ళి "ఏమిటి చిన మామయ్యా మూలుగుతున్నావ్'' అని అడిగాడు సుబ్బులు. ఆయన వెంటనే సమా ధానం చెప్పకపోయేసరికి అనుమానం కలిగి చెయ్యి పట్టుకొని చూస్తే చాలా వెచ్చగా ఉన్నది. ఒళ్ళంతా ఎక్కడ పట్టుకొని చూచినా సలసల కాగిపోతున్నది. గాభరాగా వెళ్లి తాతగారిని పిల్చుకొనివచ్చాడు. సుబ్బులు వెళ్ళి లేపితే, ముసలావిడ "ఎవరికిరా జ్వరం" అంటూ సుబ్బులు చెయ్యి

పుచ్చుకొని "అవున్రా వేడిగా ఉందే—అదే పోతుందిలే పోయి పడుకో" అన్నది మరో వైపు తిరిగిపడుకొంటూ. "వాక్కాదు చిన మామయ్యకు" అని సుబ్బులు అంటే ఆవిడ అదిరిపడి, లేచి వెళ్ళి చూచింది. దాదాపు స్పృహ లేకుండా పడుకొని ఉన్న కొడుకు ఒళ్లంతా తాకి చూచి "వాడు వచ్చిలేపితే వాడికి జ్వరం వచ్చిందనుకున్నా వాడి చెయ్యి వేడిగా ఉండడం చూచి, అయ్యోబాబో మళ్ళీ నీకే వచ్చిందిరా. ఇంకేముంది, జ్వరం తిరగ పెట్టేసింది" అంటూనే ఆవిడ ఏడ్పు మొదలు పెట్టింది. "ఊరుకోవే— ఏడ్వడం దేనికే అశుభం" అని ముసలాయన అంటున్నా, ఆవిడ ఏడ్పు మానలేదు. అది విని రాజమ్మ లేచి వచ్చింది. తల్లిని బలవంతాన ఇవతలకు తీసుకొనివచ్చి, చాపమీద కూర్చోపెట్టి తండ్రికి ధైర్యం చెబుతూ, చల్లని నీళ్ళల్లో ముంచిన గుడ్డ నుదిటిమీద ఆరగా ఆరగా వేస్తూ అన్నకు సేవ చెయ్యడానికి ప్రయత్నించింది రాజమ్మ.

గడియ గడిచిన కొద్దీ అందరికీ గాభరా ఎక్కువైంది.

ఎంతసేపటికీ వెంకట్రావుకు పూర్తి స్పృహరాలేదు. ఒకటి రెండు సార్లు కళ్ళు తెరిచి చూచాడు. ఏమిటో ఎవరి కోసమో వెతుకుతున్నట్లు చూచి మళ్లీ కళ్ళు మూసుకొన్నాడు. ఆ రాత్రి ఎలా గడుస్తుందా అని వెంకట్రావు తండ్రి మధనపడ్డాడు. ఏం చెయ్యాలో ఏమీ తోచలేదు. అయనకేకాదు ఎవరికీ ఏమీ పాలుపోలేదు.

రెండు గంటలకు వారిఇంటి ముందు కారుఆగింది. డాక్టరు గబగబా లోపలకు వచ్చి, రోగిని పరీక్షించి వెంటనే ఇంజక్షను ఇచ్చి, మందు త్రాగించాడు. వెంట తెచ్చిన ఐస్ బాగ్ ఎలా నుదుటిమీద పెట్టాలో చూపిస్తుంటే వెంకట్రావు తండ్రి నెమ్మదిగా — ఆదుర్దానుంచి అప్పుడే కాస్త తేరుకొన్నట్లుగా ఆయాసపడుతూ "సమయానికి దేవుడిలా

వచ్చారు. ఎలా వచ్చారండీ—ఎవరు చెప్పారండీ" అని అడిగాడు. "అదేమిటి — ఎవరో ఏమిటి — మీ సుబ్బులే వచ్చాడు. ఎంతో భయ పడుతూ, పరుగెత్తుకొని వచ్చాడేమో తెగ రొప్పుతూ చెప్పాడు. నువ్వంటే అడ్డు దార్ని వచ్చావ్ — నేను రావాలన్నా, వెళ్ళాలన్నా అయిదు మైళ్ళు వెళ్ళాలి. అయినా, ఇప్పుడేమిటి రేపు ఉదయం వచ్చి చూస్తానంటే కాదని కాళ్ళమీద పడపొయ్యాడు. ఏం కుర్రవాడండి వాడు. మరిచా చెప్పడం — అలా కాళ్ళమీద పడబోతుంటే వారిస్తూ జబ్బలు పట్టు కొన్నాను. వళ్లు వేడిగా ఉన్నది. పైగా గజగజ వణికిపోతున్నాడు. జ్వరం వల్లో, భయంవల్లో తేల్చుకోలేకపోయాను. బయలుదేరేదాకా ఒకటే ఊదర పెట్టాడు. తీరా బయలుదేరి నాతో రమ్మంటే మీరు ముందు పదండి అన్నాడు. నేను కూడా కదలేదాకా అక్కడే నిలబడి—ఆ తర్వాత మా అరుగుమీద కూర్చున్నాడు" అని డాక్టరు చెబుతుంటే ఒక్క ముసలాయన తప్ప మరెవ్వరూ వింటున్నట్టు కనిపించలేదు.

తెల్లవారుఝామున అయిదు గంటలకి 'నేను చెయ్యగలిగినదంతా చేశాను.' అనుకొంటూ రోగి గది బయటకు వచ్చి, డాక్టరు ముందు వసారాలో పడక కుర్చీలో నడుము వాల్చారు. కొంచెం విశ్రాంతికి ఉపక్రమించి కళ్ళు మూసుకొంటే ఆయనకు కునుకు పట్టింది.

తూర్పు తెలతెల వారుతుండగా ఇంట్లో అంతా ఒక్కసారి గొల్లు మన్నారు. డాక్టరు ఒకసారి లోపలకు వెళ్ళి చూచి బయటకు వచ్చాడు.

ఆ మరునాడు సాయంత్రం దాకా ఆ ఇంట్లో సుబ్బులు విషయం తలచుకున్నవారులేరు. ఆ పూట చీకటి పడుతుండగా ముసలాయనకు ఆ విషయం జ్ఞాపకం వచ్చి అందర్నీ అడిగాడు. మాకు తెలియదంటే మాకు తెలియదన్నారు. ముసలావిడ తెలియదని నిర్లక్ష్యంగా అనడమే కాక, "ఇంక వాడెందుకు కంటపడతాడూ వాడు నా ఇంట్లో అడుగుపెట్టి

నప్పుడే అనుకున్నా శని అడుగుపెట్టిందని. కాల్లోనక్కలా వాడు నాయన గదిలో కాచుక్కూర్చున్నప్పుడు నాకేదో భయం వేసింది. అపశకునం అను కొని ఆ భావం అణచుకొన్నా. ఆనాడే ఆ శని వెధవను బయటకు నెడితే ఇది ఇలా జరిగేది కాదేమో'' అంటూ సుబ్బులును ఎన్ని తిట్టిందో!

ముసలాయన మాటాడకుండా బయటకు వచ్చి బండి కట్టించుకొని బస్తీకి వెళ్ళి, డాక్టర్ను కలుసుకొని సుబ్బులు విషయం కనుక్కొన్నాడు. "నాకు అతను మళ్ళీ కన్పించలేదు. మొన్న ప్రొద్దున్న దాకా మా అరుగుమీదే పడుకుని ఆరు గంటలకు లేచి స్టేషను వైపుకు వెళ్ళిపోయాడని మా నౌకరు చెప్పాడు'' అని డాక్టరు అంటే ఇంక వివరాలు అడక్క ఆ ముసలాయనచెరచెరా స్టేషను వైపువెళ్లాడు. మళ్ళీ అక్కడ్నించి బండి కట్టించుకొని "ఆరింటికంటే మెయిలువేళ. విశాఖపట్నం వెళ్ళాడా ఏమిటి?' అనుకొంటూ ఇంటికి తిరిగివెళ్లాడు. "ఎక్కడికి వెళ్ళాడోఏమిటో, అదుర్దాగా ఉందే'' అంటే వాళ్లు ఏమి మాట్లాడక పొయ్యేసరికి నాయనకు కోపం వచ్చి, "తల్లీకూతురూ ఒకటే మోస్తరు మనుష్యులు. పెద్దవాడు ఇల్లు వదలి వెళితే వాడేదో శాఖాంతరం చేసుకున్నాడని కోపంతో వాడి విషయం అనుకోనైనా అనుకోలేదు మీ అమ్మ. నువ్వూ అల్లాగే తయా రయావ్. పైగా జ్వరం వచ్చిన చిన్న సన్యాసి కన్పించడం లేదంటే నీకు చీమ కుట్టినట్లయినా లేదేమే'' అని రాజమ్మను కసురుకున్నాడు. ఆ మాట విని ముసలావిడ "కొడుకుపోయి నేనేడుస్తుంటే ఈ సాధింపు లేమిటి! ఆ ముష్టి వెధవ ఎక్కడికీ పోడు పడుకోండి. ప్రొద్దుపోయింది" అన్నది.

ఆ మరునాడే సింహాద్రిగారి దగ్గరనుంచి తంతి వచ్చింది సుబ్బులు ప్రమాద స్థితిలో ఉన్నాడనీ, రాజమ్మను వెంటనే పంపమనీ.

రాజమ్మ మామగారింటికి వెళ్లేసరికి ఆయన గుమ్మంలోనే ఎదుర య్యారు. "ఎలాఉన్నదండీ వాడికి. అసలు వాడు...'' అని ఆదుర్దాగా

అడిగితే "మరేం ఫర్వాలే దివ్వాళ—నిన్న నీకు టెలిగ్రాం ఇచ్చే వేళకు మరీ ప్రమాదంగా ఉన్నదన్నారు. పోదాం పద" అన్నారు సింహాద్రి గారు. "అదేమిటి? ఎక్కడికి" అని రాజమ్మ అడిగితే "ఆసుపత్రికి—వాడు సరాసరి ఆసుపత్రికే వెళ్ళాడు వాళ్ళు కబురు చేస్తే నే నేను మొన్నా. నిన్నా చూచి వస్తున్నా నిన్న అంత జ్వరంలో ఉండి పిచ్చి చూపులు చూస్తూ కూడా నీ విషయం చెప్పాడు. అమ్మను పిలవద్దు తాతయ్యా అమ్మను రానివ్వకు ఇక్కడకు వస్తే అమ్మకు కూడా పాడు జ్వరం వస్తుందేమో అన్నాడు'' అంటూ వాడి పరిస్థితి వివరిస్తూ సింహాద్రి గారు కోడలును ఆసుపత్రికి తీసుకొని వెళ్లారు.

అక్కడ నర్సు రాజమ్మకు ధైర్యం చెప్పి "రాత్రి అంతా చిన మామయ్యా అని ఒకటే కలవరించాడండీ. పోనీ ఒకసారి పిలిపించండి" అని అంటే ఆ మాటకు రాజమ్మ ఏడుస్తూ "వీడైనా నాకు దక్కుతాడా అమ్మా" అని అడిగింది. విషయమంతా విని రాజమ్మను అవతలకు తీసుకువెళ్ళి ఓదార్చి, అనేక విధాల ధైర్యం చెప్పింది ఆ నర్సు.

ఇరవై రోజుల తర్వాత సుబ్బులు ఆసుపత్రి నుండి ఇంటికి తిరిగి వచ్చేసరికి అతని రూపమే మారి పోయింది. బక్క చిక్కిపోయాడు, జుట్టంతా ఊడిపోయింది. మనిషి వికారంగా తయారయాడు. వస్తూనే ఆకలి అంటూ వచ్చి, వంటఇంట్లో అన్నం గిన్నె కంచంలో బోర్లించుకొని, చింతకాయ పచ్చడి వేసుకొని అంత అన్నం తినేశాడు.

"ఏరా నాయనా, ఎంత జబ్బు చేసిందిరా — ఎలా అయిపోయావురా'' అని కళ్ళు నీళ్లు పెట్టుకొని దగ్గరకు తీసుకోబోతే సుబ్బులు వెళ్ళ లేదు.

అప్పుడేకాదు. ఆ తర్వాత కూడా వాడు చనువుగా ఆవిడ దగ్గరకు వెళ్ళలేదు. వాడు తన సానుభూతి, ప్రేమ కావాలనీ కోరాలనీ

అమ్మా తాతయ్య గారింట్లో నన్నేమన్నా అన్నారా అనీ, చిన మామయ్య నన్ను గురించి అడిగాడా అని వాడు స్వయంగా అడగాలనీ, అలా అడిగితే తను వాణ్ణి ఒళ్ళో కూర్చోపెట్టుకుని ఓదార్చి, హృదయభారం తీర్చుకోవాలనీ అను కొన్నది రాజమ్మ. కాని సుబ్బులు అందుకు అవకాశం ఇవ్వలేదు.

రాజమ్మ ఆ విషయాలు, ఈ విషయాలు చెప్పుకొని మాటి మాటికీ గతం జ్ఞాపకం చేసుకొని ఏడుస్తుంటే ఒకసారి సింహాద్రిగారు "అమ్మాయి నువ్వు ఇంక ఏడవమాకు. అన్నింటికీ అందరి బదులు నేను ఏడుస్తాను. నేను ఇన్నివిధాల చిత్రవధ అయ్యాను. అయినా బ్రతుకు తున్నా. నే నేం చూసుకుని ఊరడిల్లాలి. చెట్టంత ఎదిగిన కొడుకులు పోయారు. భార్య పోయింది. కూతురు లేచిపోయింది. ముసలితనం వచ్చింది. ఈమధ్య దారిద్ర్యం కూడా చూస్తున్నా'' అన్నారు.

ఆ మాటలు విని రాజమ్మ పెద్దగా ఏడ్చింది. కోడలు అల్లా ఏడుస్తుంటే ఆయనకు ఎంతో దుఃఖం వచ్చింది కాని కన్నీరు బయటకు పొర్లి రాలేదు. ఆయన కన్నీరు సంవత్సరాలుగా లోపలకు ప్రవహించడం మొదలుపెట్టింది. కన్నీటి చెరువు అయింది ఆయన హృదయం. ఎన్ని కొత్త వాగులు వచ్చి పడ్డా లోలోన ఇముడ్చుకొంటున్నది ఆ కన్నీటి తటాకం.

ఆయన మాటాడడం మానేశారు.

కనీసం సుబ్బులును అల్లరి చేయవద్దని చెప్పడం కూడా మానేశారు. వాడు ఎంత అడిగితే అంత ఇవ్వడం మొదలుపెట్టారు. "ఒరేయి సుబ్బులూ బయటకు వెళ్ళి ఏదైనా తిను. అమ్మ దుఃఖంలో ఉన్నది నీకేం చేసి పెడుతుంది'' అని ఒక్కసారే అన్నారు. ఇక అప్పటినుంచి వాడికి ఏం కావాలంటే అదల్లా ఇవ్వడం మొదలు పెట్టారు. ఇల్లు గుండం అయి పోతుంది. వాడికి మళ్ళీ జబ్బుచేస్తుంది వద్దని రాజమ్మ అడ్డువచ్చింది. కాని ఆవిడ మాట సాగలేదు.

సింహాద్రిగారు తిరుగుతూ తిరుగుతూనే మంచం ఎక్కారు జబ్బేమీ లేకుండానే అలా శూన్యంలోకి చూస్తూ చూస్తూనే కన్ను మూశారు.

కర్మ అయిన మరునాడు "నేనింక వెళతానమ్మా వదినా. నాన్న బ్రతికి ఉండగా వచ్చి క్షమాభిక్ష వేడుకొనే భాగ్యం లేకపోయింది. ఆఖరి చూపు కూడా నాకు దక్కలేదు. సరే జరిగిపోయిన వాటికి ఇప్పుడు ఏడ్చి లాభం ఏముంది?'' అని సింహాద్రి గారి కూతురు ఒక్క క్షణమాగి ఏదో స్ఫురణకు వచ్చినట్లు "వదినా ఇంత ఇంటికి సుబ్బులు ఒక్కడు మిగిలాడు. వాణ్ణి నా వెంట పంపు తీసుకొని పోతా" అన్నది.

ఆ మాట విని రాజమ్మ ఆశ్చర్య పడ్డది. రాజమ్మ చాలా సేపటి దాకా మాటాడలేక పోయే సరికి సింహాద్రిగారి కూతురు మళ్ళీ అందుకుని "లేచిపోయి కులం మర్యాద పోగొట్టుకున్నదాన్ని నా వెంట పంపడం నీకు ఇష్టం అవుతుందని నేను అనుకోడంలేదు. కాని ఒక్క విషయం వదినా! నేను అన్నీ విన్నా. వాడి మూలంగా నీకూ, ఈ ఇంటికీ ఆఖరికి నీ పుట్టింటికి దరిద్రం చుట్టుకొన్నదని మా అమ్మా, మీ అమ్మా అందరూ అన్నారట. నువ్వూ అన్నావట. అనగా అనగా వాడికీ అదే నమ్మకం కలిగింది. వాడు అక్కడికి వెళితేనే వాడి చిన మామయ్యా పోయాడుట. వాడు ఆ విషయం చెప్పుకొని ఎంత ఇదయ్యాడో. సరే అవన్నీ ఎందుకులే. నిన్నేమో అంటున్నానని మాత్రం అనుకోకు. నాకు వాడి విషయం దిగులుగా ఉన్నది. అక్కడ నాకు నా అనే వాళ్లు అంటూ ఎవరూ లేరు. నాకు కాస్త తోడుగా ఉంటాడు. ఇంత బలగం, ఆస్తి పేరు ప్రతిష్ఠా ఉన్న ఈ ఇంటికి వారసుడుగా మిగిలింది వాడొక్కడే. వాణ్ణి కనిపెట్టి ఉండవలసిన బాధ్యత, హక్కు నాకూ ఉన్నది. పైగా వాడు నాతో వస్తానంటున్నాడు. ఇక్కడే వుంటే నువ్వు కూడా దక్కవని వాడికి భయం ఏర్పడింది." అని చెప్పడం ఆపి, క్షణం తర్వాత మళ్ళీ అందుకొని "వదినా! నువ్వా పుట్టెడు దుఃఖంలో ఉన్నావునీ

పుట్టింటివార్ని చూద్దామా వారూ అదే పరిస్థితిలో ఉన్నారు. వాడికి చదువు సంధ్యా చెప్పించి, ఓదార్లో ఎవరు పెడతారు. నా మాట విను. నా వెంట రానీ వాణ్ణి. ఆడపిల్లయితే నాబోటి దాని దగ్గర ఉంటే పెళ్ళి పెటాకూలు ఎలా అవుతుందని దిగులు పడచ్చు మగబిడ్డ. ఆ దిగులేం లేదుకదా. అదీకాక నాకు మరోభయం పట్టుకొన్నది_ వాడికాజ్వరం మళ్ళీ వస్తుందేమోనని. ఈ ప్రాంతాలలో ఈరకం జ్వరాలు చాలా మందికి వస్తున్నాయనీ, కొన్ని కుటుంబాలు యిలా కూలిపోతున్నాయనీ విన్నాను. వీణ్ణి దక్కించుకోనీయ్ నన్ను" అన్నది.

రాజమ్మ ఆవిడ మాటలు విని కాకపోయినా, కొడుకు పట్టుదల చూచి వాణ్ణి ఆవిడతో పంపక తప్పలేదు.

o o o o

బొంబాయి వచ్చిన కొద్ది రోజులకే సుబ్బులు, ప్రవర్తన పూర్తిగా మారిపోయింది. మేనత్త గీచినగీటు దాటకుండా నడుచుకోవడం మొదలు పెట్టాడు. వచ్చిన వారంలోనే "మామయ్య గారితో నాకు పరిచయం చెయ్యత్తయ్యా - ఆయన గొప్ప డాక్టరటగా" అంటే ఆవిడ సుబ్బులుకు ఆయనతో పరిచయం చేసింది అలా కలిగిన పరిచయాన్ని ఇట్టే పెంపొందించుకొన్నాడు సుబ్బులు.

అతను ఆయన దగ్గర అతి తక్కువ కాలంలో ఎంతో చనువు సంపాదించాడు. కొద్ది రోజులలో ఆయనతోపాటు రోగులను చూడడానికీ వెళ్ళడం మొదలుపెట్టాడు. అలా వెళ్ళినప్పుడు అతను ఆయనకు ఎంతో సహాయంగా ఉండేవాడు

సుబ్బులు తనయందు ప్రదర్శిస్తున్న వినయవిధేయతలు, రోగుల పట్లచూపుతున్న సేవాసక్తి డాక్టరుగారిని ముగ్ధుణ్ని చేశాయి. అవకాశం

చిక్కినప్పుడల్లా అతను ఆయన్ను ఏన్నో ప్రశ్నలు వేసేవాడు. ఎప్పుడు అడిగినా జ్వరాలను గురించీ, రోగ నిదానం గురించీ అడిగేవాడు. ఒక సారి అతను ఏదో విసుక్కున్నట్టుగా డాక్టరు గారితో "వెధవ టైఫాయిడ్ జ్వరం వస్తే మనుష్యులు చావటమేమిటండీ! దానికి మంచి సరియైన మందు లేదండీ?" అని అడిగాడు సుబ్బులు.

ఆ అడిగిన ధోరణి చూచి ఆయన ఆశ్చర్యపడుతూ "లేదబ్బాయి ఇప్పుడిప్పుడే ఈ విషయమై పరిశోధన ప్రారంభమైంది. ఎవడో కనిపెడతాడు మహానుభావుడు" అన్నారు.

"ఆ మహానుభావుడు ఒక్కరవ్వ ముందే పుట్టి ఆ మందు కనిపెట్టి వుంటే మా నాన్నకు వ్యాధి నయమయేది. మా చిన మామయ్య బ్రతికేవాడే" అంటూ ఏదో ఆలోచనలో పడి ఆయనవంకే చూస్తున్నా ఏటో చూస్తున్నట్లున్న సుబ్బులు కళ్లల్లోకి ఆశ్చర్యంగా చూశారు డాక్టరు గారు. అతని కన్నులు అశ్రుపూరితం కాలేదు. మొదట ఏ భావం పైకి ప్రస్ఫుటం కాలేదు. లోతుకు తీసుకొని పోతున్నాయి అతని కళ్లు. తీసుకొని వెళ్ళిన మేరకు మించి పరిశీలించారు డాక్టరుగారు. ఆయనకు అతను పూర్తిగా అర్థమయాడు.

ఆ సమయంలో అతనికి మంచి ఆలోచన వచ్చింది. అంతలో అది స్థిరపడింది. దానికి డాక్టరు గారు పైకి ఏమీ అనకుండానే ఒక స్థిర రూపం కల్పించారు. ఆయన దో యథాలాపంగా అన్నమాట పట్లుకొని సుబ్బులు ఆయేడు మెట్రిక్ పరీక్షకువెళ్ళి ఉత్తీర్ణుడయ్యాడు. అందుకు సంతోషించి అతని మేనత్త కళాశాలలో చేర్చిపుస్తకాలు కొనిఇస్తే దీక్షగా చదివి ఊరికే ఉత్తీర్ణుడవడం కాక స్కాలర్‌షిప్పు కూడా సంపాదించాడు. డాక్టరుగారు. తనపలుకుబడి ఉపయోగించి సీటు ఇప్పిస్తే. మేనత్త ఆర్థిక

సహాయం చేసి ఆదుకుని ప్రోత్సాహిస్తే అతను వైద్యకళాశాలలో చేరి నిద్రాహారాలు మాని చదివాడు. అన్ని సంవత్సరాల వైద్య విద్యాధ్యయనం ఒక్క సంవత్సరంలో పూర్తి చేశాడా అని పించింది అతని మేనత్తకి. "అత్తయ్యా! ఇక్కడ నా చదువు అయిపోయింది'' అన్నాడతను.

సుబ్బులు కృతజ్ఞత చెప్పుకుంటూ "కన్న తల్లికీ, తండ్రికీ, తాతకూ, ప్రేమ చూపి ఆదరించిన చిన మామయ్యకూ ఋణపడలేదు కాని నీకు చాలా ఋణపడ్డాను అత్తయ్యా, ఎల్లా తీర్చుకోను నీ ఋణం!'' అన్నాడు.

"అదేమిట్రా అల్లా అంటావ్, ఏదో నీ అదృష్టం బాగుంది. వచ్చావ్ కష్టపడి చదువుకొన్నావ్ ప్యాసయ్యావ్. ఇందులో నేను చేసిందేముంది'' అన్నది సింహాద్రిగారి కూతురు మేనల్లుడి వంక గర్వంగా చూస్తూ.

ఆవిడ చేసింది ఏమున్నదో అతనికి తెలుసు. అందుకే అతను వెంటనే "నాకు తెలియదా'' అన్నాడు. ఆవిడ సంతోషంతో పొంగిపోతూ, చిరునవ్వు నవ్వుతూ "నువ్వు ఎమ్. డి. కూడా కా'' అన్నది. అతను అయాడు. అయిన తర్వాత ఇన్నాళ్లుగా అతన్ని బాధిస్తున్న అంశం బహిర్గతం అయింది. దేనికి ఇంత ఆదుర్దాగా ఇంత పట్టుదలగా ఈ చదువు చదివిందీ అతనికి అర్థమైంది.

అతను పరిశోధన ప్రారంభించాడు. సుబ్బులు పరిశోధనలో చూపిస్తున్న దీక్ష చూచి ఆ పరిశోధనా సంస్థ అధికారులు ఎంతో మెచ్చుకొని ఉన్నత స్థాయి పరిశోధన నిమిత్తం విదేశాలకు పంపారు.

అతను అమెరికా వెళ్ళాడు. తనకు కావిలసిన మందు కనిపెట్టి తిరిగి వచ్చాడు.

గొప్ప పరిశోధకుడుగా, గొప్ప వైద్యుడుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించి తిరిగి వచ్చిన సుబ్బులును చూచి అతని మేనత్త ఎంతో పొంగిపోయింది. ఆనందాశ్రువులతో నిండిన కళ్లు తుడుచుకుంటూ అతని చెయ్యి పుచ్చుకొని "నాయనా నువ్వు ఒక్క పది సంవత్సరాలు ముందు పుట్టి ఈ మందు కనిపెట్టి ఉంటే మా చిన్నన్న బ్రతికేవాడు—మీ చిన మామయ్యా బ్రతికేవాడు'' అంటూ పొర్లివస్తున్న దుఃఖం ఒక్క సారిగా ఆపుకొని "పోన్లేరా — ఆ విషయం మనం మర్చిపోదాం. మనకు లోకం నిండా చిన్నన్నలూ, చిన మామయ్యలూ ఉన్నారు. వాళ్ళ కోసం వినియోగించు ఈ మందు'' అన్నది. ఆవిడ వెళ్ళి తీసుకొని వస్తే వచ్చిన రాజమ్మ కొడుకును అమాంతం కౌగలించుకొని "ఎంత వాడివయ్యావురా. అవును మీ అత్తయ్య అన్నట్లుగా ఎవరి అదృష్టం వారిది—అత్తయ్య మాటే నిజంరా— నువ్వు నిజంగా ... సుబ్బులూ నువ్వు నిజంగా అదృష్టవంతుడివిరా'' అన్నది.

# పగ అడగించుటెంతయు శుభంబు

తరగతినుంచి ఉపాధ్యాయుల గదిలోకివచ్చి గణితబోధిని, డస్టర్, విరిగిపోయిన సుద్దముక్కలు బల్లమీద పడేసి, ఒక్కక్షణం విశ్రాంతి తీసుకుందామని అలా కుర్చీలో కూర్చున్నానో లేదో "మిమ్మల్ని హెడ్ మాస్టర్‌గారు రమ్మంటున్నారండీ" అంటూ బడి నౌకరు ప్రత్యక్షమయాడు.

"వస్తా. పద'' అని అతన్ని పంపించాను.

ఇంతలో "వినదగు నెవ్వరు చెప్పిన" అన్నారు శాస్త్రిగారు చిరునవ్వు నవ్వుతూ. ఆయన మా పాఠశాలలో ఆంధ్రోపాధ్యాయులు.

"వెంటనే వెళ్ళకపోతే ఆయన అపార్థం చేసుకోడానికి అవకాశం కల్పించిన వా రవుతారు'' అన్నారు రామారావుగారు ఇంగ్లీషులో. ఆయన మా బళ్ళో ఇంగ్లీషు టీచరు. ఆయన ఎమ్.ఏ. కాని అదృష్టం బాగుండక బడిపంతులుగా పని చేయవలసి వచ్చింది.

నా కెదురుగా కూర్చుని, చుట్ట కాలుస్తూ, "ఆలస్యం అమృతం విషం" అని పెద్దలు ఊరికే అనలేదండీ. పోనీ, ఓసారి వెళ్ళిరాకూడదూ'' అని శాస్త్రిగారు మళ్ళీ హెచ్చరించిన తర్వాత నేను నెమ్మదిగా బయలుదేరాను ఈసారి పిలవనంపిన కారణం ఏమై ఉంటుందా అనుకొంటూ.

"రండి, రండి. మీకోసమే ఎదురు చూస్తున్నాను. వస్తారో రారో అనుకొంటూ ఉండగా వచ్చారు'' అంటూ గుమ్మంలోనే స్వాగతవచనాలు పలికారు మా ప్రధానోపాధ్యాయులు.

ఆయన స్వాగత వాక్యాల తీరే అంత. రావడం ఇంత ఆలస్యమైనదేమని అడగడానికి ఆయన అవలంబించే పద్ధతే ఇది. నాకు ఇదేమీ క్రొత్త కాదు.

మొదటిరోజులలో పిలిచిన వెంటనే వెళ్లేవాణ్ణి. తరగతి విడిచిపెట్టి, పాఠం మధ్యలో వదిలివేసి వెళ్ళిన సందర్భాలూ ఉన్నాయి. కాని తర్వాత తర్వాత ఆయన ధోరణి అర్థంఅయాక—పిలిచి చెప్పేమాటలు ఎప్పుడు విన్నా ఫరవాలేదనే నిర్ణయానికి వచ్చాక – ముందు పని ముగించుకొని వెళ్ళడం మొదలుపెట్టాను. ఇవాళకూడా అలాగే జరిగిందని ఆయన అనుకొని ఉండవచ్చు.

"క్లాసునుంచి ఇప్పుడే వచ్చాను. ఎందుకో పిలిచారట'' అంటూ నేను ఆయనవెంట లోపలకు నడిచాను. ఆయన వెళ్ళి తన కుర్చీలో సుఖాసీను లయారు. ఆ కుర్చీలో సుఖంగా కూర్చొనడానికి, హాయిగా ఆనుకొనడానికి మంచి మెత్తలు అమర్చుకొన్నా రాయన అలా కూర్చొని అయన ఒకసారి రెండు కళ్ళూ మూసుకొని మౌనముద్ర వహించారు.

ఒక్కక్షణం వేచి ఉన్నాను.

ఇంకా కొంతసేపు నేను మాటాడకుండా అలాగే నిలబడిఉంటే ఆయన నా విషయం మరిచిపోయి. ఓ కునుకుతీసే ప్రమాదం ఉన్నదని అనిపించి "అయ్యా, నన్ను ఎందుకో పిల్చారు...!'' అన్నాను. హెడ్ మాస్టర్‌గారు ఒక్కసారి కళ్ళు తెరిచి "అవునవును'' అని మళ్ళీ మౌనం వహించేసరికి, నాకు కొంచెం చిరాకువేసింది.

అయనఅంటే మొదట్లో నాకు ఎంతో గౌరవం ఉండేది. స్వయంగా చెప్పుకోదగిన పాండిత్యం, ప్రతిభా లేకపోయినా ఆయన పండిత కుటుంబంలో జన్మించారు. ఈ తరంలో పెద్ద ఆస్తిపాస్తులు

లేకపోయినా ఆయనకు మంచి పలుకుబడిమాత్రం ఉన్నది. ఇవన్నీకాక ఆయన మంచి విగ్రహపుష్టి కలవాడు. మంచి రంగు. అందమైన మగ వాళ్ళంటే నాకెందుకో ఒక విధమైన గౌరవం. ఆ గౌరవం ఆయన ఇంగ్లీషు ధారాళంగా మాటాడడంతో మరికొంత పెరిగింది. అది ఇంకా పెరిగి భక్తిభావంగా మారేదేకాని, ఆయన స్వభావం తెలిసిరావడం ఒక ఆటంకం అయింది.

ఏదో సుడిఉండి, అదృష్టం కలిసివచ్చి హెడ్‌మాస్టర్ అయాను అనుకోక తనంత పండితుడూ, ప్రతిభావంతుడూ, పరిపాలనాదక్షుడూ, అపూర్వ అనుభవశాలీ మరెక్కడా లేనందువల్లనే తన కా పదవి లభించిందని అనుకోవడం, కమిటీవారు విశ్వప్రయత్నం చేసినమీదట తను ఆ పదవి స్వీకరించడం జరిగిందని అనడం, అందుకు అనుగుణంగా ప్రవర్తించడంతో వచ్చింది చికాకు. ఒక వ్యక్తి మహా ప్రతిభాశాలి, అధిక వ్యుత్పన్నుడో అయితే ఆ ప్రతిభావ్యుత్పత్తులు విద్యాధ్యయనదశ లలో ఏదో ఒక దశలో, ఏదో ఒక సందర్భంలో వెల్లడిఅయి తీరతాయి. ఆ వ్యక్తి బి.ఏ. పరీక్షలో రాష్ట్రం అంతటిలో ప్రథముడుగా ఉత్తీర్ణుడు కావడమో, ఎమ్.ఎ. లో విశ్వవిద్యాలయం అంతటికీ ప్రప్రథముడుగా ఉత్తీర్ణుడు కావడమో జరుగుతుంది. మా హెడ్‌మాస్టరుగారి విషయంలో అటువంటిదేమీ జరగలేదు. పైపెచ్చు ఇంటర్, బి.ఏ. లు రెండింటిలో కూడా అయన మార్చి, సెప్టెంబరు, మార్చి, పరీక్షలకు హాజరై, తద్రూ పేణా విశ్వవిద్యాలయానికి విరాళం కొంచెం ఎక్కువగానే ముట్టజెప్పి ఉత్తీర్ణులయారు. విశ్వవిద్యాలయం వారు ఈ పరీక్షలు రహస్యంగా నిర్వ హించరు. కనుక, మాకందరికీ ఈ విషయాలు తెలిశాయి. అయినా మాకు హెడ్‌మాస్టరు కనుక మే మెవరమూ ఆ విషయాలు ప్రస్తా వన వచ్చినప్పుడు కూడా ఎత్తము. మరో విశేషం, ఆయన కూడా ఈ విషయాలు మాకు తెలియవన్నట్లుగానే ప్రవర్తిస్తారు.

ఆయన నాకంటే అయిదు సంవత్సరాలు పెద్ద. మా అన్నగారి కంటె మూడేండ్లు పెద్ద. మాఅన్నగారికీ, నాకూ రెండేండ్లు వార. ఆయన బి.ఏ. పరీక్షకు మా అన్నగారితోనూ హాజరయారు; నాతోనూ హాజరయారు.

మా హెడ్‌మాస్టరుగారు నాకంటె వాస్తవానికి అయిదు సంవత్సరాలు మాత్రమే పెద్ద అయినా, ఓ ఇరవై సంవత్సరాలు పెద్దఅయినట్లు ప్రవర్తించేవారు. అందుకు కూడా నేను ఆట్టే పట్టించుకొనేవాణ్ణి కాదు. ఆ పెద్దరికం ఎప్పుడూ ఆయనకే కట్టబెట్టేవాణ్ణి. ఉపాధ్యాయుల సమావేశాలలోనూ, ఇతర సందర్భాలలోనూ "మేము చదువుకొనే రోజుల్లో పాఠ్యగ్రంథాలు, పరీక్షలు మహాకఠినంగా ఉండేవి. ఆ ప్రమాణాలు ఇప్పుడు పడిపోయాయి'' అంటూ ఉపన్యాసాలు ఇచ్చినప్పుడు ఆయన వాక్చాతుర్యానికి అబ్బురపడ్డానేగాని మరో ప్రసక్తి తెచ్చేవాణ్ణి కాను. నాతో స్వయంగానూ ఆ మాట ఎన్నోసార్లు అన్నారు. అప్పుడు కూడా నేను మరోమాట అనలేదు. అటువంటి పెద్దరికం ప్రదర్శించడం కోసమనే ఆయన నన్ను అంతసేపు నిలబెట్టారు. "కూర్చోండి'' అంటే తమ పెద్దరికానికి ఏమి భంగం గలుగుతుందో అని ఆయన భయం.

కొన్ని నిముషాల తర్వాత ఇక లాభంలేదని నేనే "పిలిచిన పనేమిటో సెలవివ్వారుకాదు'' అన్నాను.

అందుకాయన "మొన్న రావుగారూ, కృష్ణయ్యగారూ మా ఇంటికి వచ్చినప్పుడు మన సెక్రటరీగారి పెద్దబ్బాయి నా కేదో కబురు చెప్పడానికి వచ్చాడు'' అంటూ ప్రారంభించారు నెమ్మదిగా.

ఆయన ఏ విషయమైనా ప్రారంభించే పద్ధతే అది. ఎక్కడో మొదలుపెట్టి ఏమేమో చెబుతూ, స్వీయ వైభవం, తనకూ, కమిటీ పెద్దలకూ మధ్య నానాటికీ దృఢతరం అవుతున్న స్నేహసంబంధం మాటల

మధ్య వెల్లడిచేస్తూ. ఎప్పటికోగాని అసలు విషయానికి రారు. వారూ, వీరూ వస్తున్నారు; తమరు మా దర్శనానికి రావడం లేదేమని అలా పరోక్షంగా అడగడ మదీ అయాకగాని అసలు ప్రశ్న వెయ్యరు. నా కీ తంతు తెలుసు కనుక "నాకు మళ్ళీ మూడో గంట క్లాసు ఉన్నదండీ. విషయం చెప్పి పంపిస్తే కాసేపు విశ్రాంతి తీసుకుంటాను'' అన్నాను: అంటూ ప్రాధేయపడ్డాను. ఆ పూట నా అదృష్టం బాగుంది. ఆయన వెంటనే అన్నారు :

"అచ్చే. మరేమీ లేదండీ. మిమ్మల్ని అభినందిద్దామని పిలిచాను. గత ఆదివారం బహిరంగసభలో మీరు చాలా చక్కగా ప్రసంగించారటగా. తెలుగులోనేకాక, ఇంగ్లీషులోకూడా అనర్గళంగా మాట్లాడారని వా రంతా చెబితే నేను మొదట్లో నమ్మలేదు సుమండీ. మీకు నా హృదయపూర్వక అభినందనలు.'' చివరి రెండు ముక్కలు ఇంగ్లీషులో ఎంతో గంభీరంగా పలికారు.

"చాలా థాంక్సు."

అలా కృతజ్ఞత చెప్పుకొని "మరి సెలవు''అని నేను గుమ్మందాకా వచ్చాను. ఆయన చప్పున లేచివచ్చి నా భుజంపై ఎంతో ఆప్యాయంగా, తాతగారు మనుమణ్ణి తడుతున్నట్లుగా తట్టి "మీకు ఉజ్జ్వల భవిష్యత్తు ప్రాప్తించాలని నా కోరిక'' అన్నారు చిరునవ్వు నవ్వుతూ.

నా మొహం! ఉపాధ్యాయుడుగా ఉన్న నాకు ఉజ్జ్వల భవిష్యత్తు ఎక్కడుంది? ఆయన నా తరపున ఊహించిన, ఆకాంక్షించిన ఉజ్జ్వల భవిష్యత్తు ఏమిటో నా కా క్షణంలో అర్థంకాలేదు.

నాకంటే వయస్సులో చాలా పెద్దవాడులా ప్రవర్తించడం అంటే ఇదే. అయినా పదవి రీత్యా పెద్ద కనుక, దీవించడం, మంచి కోరడం సహజంగానే ఉన్నాయనుకొని సరిపెట్టుకొని, మరోసారి కృతజ్ఞత తెలుపు

క్లావి _నేను బయటకు రాబోతుంటే ఆయన హఠాత్తుగా స్వరం హెచ్చించి, "ఆరోజున మనం డి. ఇ. ఓ. గారికి ఇచ్చిన విందులో నన్ను గురించో, పోనీ మన స్కూలును గురించో రెండు మాటలు చెప్పమంటే భయమనీ, సభాకంపం ఉన్నదనీ అన్నారే" అని ఆగి, అసలు విషయం బయటపెట్టి "ఇంతకూ మీరు ఆ పార్టీలో చేరారన్న మాట?" అని ప్రశ్నించారు.

" నే నెందుకండీ ? కృష్ణయ్యగారూ, రావుగారూ ఉన్నారుగా. వారిని ఆదేశించక పొయ్యారా ?'' అనేసరికి ఆయన రుసరుస లాడుతూ "వాళ్లేం మాట్లాడుతారో నే నెరగనా ! అయినా వారి విషయం ఎందుకు ? మిమ్మల్నిగదా నేను అడిగింది. ఆనాడు మీరెందుకు మాట్లాడ లేదనికదా మిమ్మల్ని నే నిప్పుడు అడుగుతున్నది. దానికేమిటి మీ సమాధానం ?'' అని రెట్టించి అడిగారు.

'అభిమానం చూపడానికి వారూ, పని చెయ్యడానికి మేమూనా ? మీ అభిమానులైతే బడికి గంటల తరబడి ఆలస్యంగా రావచ్చునా ? క్లాసు వదిలేసి సొంత పనుల మీద ఊరిమీద తిరగడానికి వారికి మీరు ప్రత్యేక అనుమతి ఇవ్వడమా ? బెంచీలు వెయ్యడం దగ్గరనుంచి అడ్డమైన పనులకూ మేం కావాలా ? పోనీ ఈ పని కూడా మీ అభిమానులకే చెప్పక పోయారా ? స్తుతి ఫలం వారికే దక్కనీయక పోయారా ?' అని నాలుగూ అందామనిపించింది. ఆయనతో అటువంటి ప్రసంగం చెయ్యడం మంచిదికాదని, అది అధిక ప్రసంగం అవుతుందని గ్రహించి "అబ్బే, ఇటీవల అభ్యాసం చేస్తే సభాకంపం అదీ పోయిందండీ, అందువల్ల అక్కడ మాట్లాడగలిగాను" అని మాత్రమే సమాధానం చెప్పి "మీరు నన్ను పిల్చిన పని ఇంతేకదా. మరి సెలవు'' అని చెప్పి బయటకు వచ్చేశాను ఆయన నా వంక కొరకొర చూస్తున్నా లెక్క చెయ్యకుండా.

అప్పటి నుంచి ఆయనకు నా మీద కోపం ఎక్కువ అవుతూ వచ్చింది. ఆయనకు నా మీద ముందు నుంచీ కోపం ఉన్నది. దానికి కారణాలు కూడా నాకు తెలుసు. ముఖ్య కారణం నేను తన్ను ఆశ్రయించక పోవడం. ఈ రోజులలో ఆశ్రయించడం పెద్ద తప్పుకాదనీ, ఎంతో మంది ఏదో ఒక సందర్భంలో ఎవరినో ఒకరిని ఆశ్రయిస్తూనే ఉన్నారనీ నాకూ తెలుసు కాని అడ్డమైన ప్రతి చిన్న విషయానికీ కన్పించిన ప్రతి వాణ్ణీ ఆశ్రయించడమూ, ఇక వాణ్ణి ఇంతవాడివి, అంతవాడివి అని స్తుతించడమూ నాకు గిట్టదు. కాని మా హెడ్‌మాస్టరుగారికి అటువంటి వాళ్ళంటేనే ఇష్టం; అపేక్ష.

రోజూ స్తోత్రపాఠాలు వల్లించే అభిమానులు బడికి ఆలస్యంగా వచ్చినా ఫర్వాలేదు. వాళ్ళు బళ్లో పాఠాలు చెప్పకపోయినా, కోర్సు పూర్తి కాకపోయినా ఇబ్బందిలేదు. "చరిత్రేకదా. జాగ్రఫీయేకదా ! పిల్లలు ఇంటి దగ్గరే చదువుకోవచ్చు. వాళ్లే చదువుకుంటారు" అంటా రాయన. అదే మరొకరు చెప్పే విషయమైతే అది ఎంతోముఖ్యమనీ, ఆ పాఠం ఆ రోజే చెప్పాలనీ, పాఠాలన్నీ ఒక్కసారే చెప్పేస్తే పిల్లలకు మనసుకు ఎక్కదనీ, జీర్ణం కాదనీ, పైవాళ్ళ దృష్టిలోకి వెళితే బాగుండ దనీ ఇలా ఎన్నో అంటారు. అదీ ఆయన వరస. ఇతరులు సెలవు పెడితే, అకారణంగా పెట్టారనీ, వారు సెలవు పెట్టినందు వల్ల బడిలో పని చెడిపోయిందనీ వ్యాఖ్యానం చేస్తారు. అదే తన అభిమానులయితే వారి పట్ల ఎంతో సానుభూతి ఒలకపోస్తారు. "పాపం కృష్ణయ్యగారు సెలవు పెట్టారు. పాపం, ఆయన భార్యకు బాగాలేదట. ఆయన డబ్బుకు ఇబ్బంది పడుతున్నారట !" అంటూ అడగని వాళ్ళకు కూడా చెబుతారు. తమతోపాటు మేమంతా కూడా సానుభూతి చూపాలని ఆశిస్తారు.

ఒకసారి ఒక మాస్టరుగారు సెలవుపెట్టారు. దానిమీద రాద్ధాంతం చేశారు. హెడ్‌మాస్టరుగారు. "సెలవుపెట్టడానికైనా అర్థం ఉండాలి.

పైగా ఒంట్లో బాగాలేదని అబద్ధం చెప్పడం దేనికి?" అంటూ శాస్త్రిగారితో వెటకారంగా మాటాడితే ఆయనకు చిరాకువేసి "మొన్నరావు గారూ. కృష్ణయ్యగారూ ఇద్దరూ కలసి ఒక్కసారే ఒంట్లో బాగాలేదని సెలవు కూడా పెట్టకుండా వెళ్ళిపొయ్యారే. వాళ్ళిద్దరి క్లాసులూ నన్ను చూడమని పురమాయించారు. మరిఅప్పుడు తమరేం వ్యాఖ్యానం వేయలేదేమండీ?" అని అడిగారు.

"అనవసరంగా వాళ్ళ ప్రస్తావన తెస్తా రెందుకండీ? ఇద్దరికీ ఒక్కసారి తలనొప్పి రాకూడదా. ఏమిటి? అడిగే వెళ్ళారు" అన్నారు హెడ్ మాస్టరు గారు. అందుకు శాస్త్రిగారు నవ్వుతూనే "మీరు ఉపాధ్యాయులను రెండు వర్గాల కింద విభజించి చూ స్తున్నారు. తమ ఆశ్రితులు ఒకవర్గం, ఇతరులు మరొక వర్గం. విభజించి పాలించే తెల్లవాడి సూత్రం పాటిస్తున్నారు. అది ఎవరికీ మంచిది కాదు'' అన్నారు.

దానితో హెడ్‌మాస్టరుగారికి శాస్త్రిగారిమీద పట్టరాని ఆగ్రహం వచ్చింది. అప్పటి కప్పుడు ఏమీ అనలేదుగాని, ఆ రోజు నుంచి చీటికీ మాటికీ శాస్త్రిగారిని మందలించడం ప్రారంభించారు. శాస్త్రిగారు పాఠాలు సరిగా, శ్రద్ధగా చెప్పడంలేదనీ, 'నోట్స్ ఆఫ్ లెసన్సు' వ్రాయడంలేదనీ విమర్శించడం మొదలుపెట్టారు. శాస్త్రిగారు ఆయనకు సమాధానం చెప్ప లేదు. కాని హెడ్‌మాస్టరుగారి ధోరణి మాత్రం మారలేదు.

ఒకరోజున ఉపాధ్యాయుల సమావేశంలో హెడ్‌మాస్టర్‌గారు శాస్త్రిగారిని మనస్సులో పెట్టుకొని తెలుగుకు సంబంధించిన బోధనస్థాయి పడిపోయిందనీ, ముఖ్యంగా వ్యాకరణం సరిగా బోధించడం లేదనీ, పైపెచ్చు లోపభూయిష్ఠంగా ఉంటున్నదనీ అన్నారు. శాస్త్రిగారు ఉండబట్టలేక "సోదాహరణంగా వివరిస్తే సంతోషిస్తాము" అన్నారు.

హెడ్‌మాస్టరుగారు అలా తాము స్వయంగా వివరించవలసి వస్తుందని ముందుగా ఊహించలేదు. అందువల్లనే కొంచెం తికమకపడి

మళ్ళీ సర్దుకుని "వివరాలు ఎందుకులెండి. మిమ్మల్ని ప్రత్యేకించి ఉద్దేశించి నేనేమి అనలేదు. ఊరికే మాతృభాష బోధన స్థాయి పెరగాలని చెప్పడానికి ప్రస్తుత స్థితి వివరించాను" అని తప్పించుకోడానికి ప్రయత్నిస్తే శాస్త్రిగారు ఆప్రయత్నం కొనసాగనీయలేదు.

"అయ్యా రంగారావుగారూ! మీరు చెప్పేదు మాటల వివి తప్పుడు విమర్శకు దిగకండి. అది తర్వాత చూచుకొందాం అసలువిషయానికిరండి. వ్యాకరణ బోధన లోపభూయిష్ఠంగా ఉన్నదని అన్నారు. మేము ఏమిటి తప్పు చెప్పాము? అందులో తమకు కన్పించే తప్పు నేను చేశానూ అంటే అది నిజంగా విచారించవలసిందే" అంటూ శాస్త్రిగారు నిగ్గదీశారు.

హెడ్మాస్టరుగారు సాధారణంగా అటువంటి సందర్భాలలో మంచి లౌక్యం ప్రదర్శించి తప్పుకొనేవారు. కాని ఆనాడు ఆయన లౌక్యం పని చెయ్యలేదు. ఎల్లాగయినా తనది పైచేయి అనిపించుకోవాలని శాస్త్రిగారితో వాదనకు దిగారు. తాను విన్న విషయాలు సొంతంగా ఆలోచించి చెబుతున్నట్లు నటిస్తూ, దాంతో పెద్ద రభస అయింది.

శాస్త్రిగారు అలంకారం వ్యాకరణాలలోనే కాక సాహిత్యంలో కూడా కూలంకషమైన పాండిత్యం సంపాదించిన వ్యక్తి. ఆంధ్ర సాహిత్యమే కాక, ఆంగ్ల సాహిత్యం కూడా మధించిన దిట్ట. దానికి తోడు ఆయన మంచి వక్త. కాని ఆయన సాధారణంగా వాదనకు దిగరు, దిగారా మరి వదలరు.

ఆనాడు సరిగ్గా అదే జరిగింది. చివరకు హెడ్మాస్టరుగారు తల వంచవలసి వచ్చింది. ఆయనే కాదు మేమంతా కూడానూ. ఆంధ్ర

సంస్కృతే ఆంగ్ల వ్యాకరణ శాస్త్రాలను పోల్చి చెబుతూ శాస్త్రిగారు పాండితీ వైభవం ప్రదర్శిస్తుంటే, మేమంతా వినయ వినమ్రులమైనాము.

శాస్త్రిగారు వాదన, ప్రసంగం ముగిస్తూ, "అయ్యా హెడ్‌మాస్టరు గారూ! ఇంకెప్పుడూ దయచేసి ఇలాంటి రిమార్కులు చెయ్యకండి. తెలియనప్పుడు గుంభనగా ఉండడం మంచిది" అన్నారు.

హెడ్‌మాస్టరుగారు ముఖాన గంటు పెట్టుకొని సమావేశం నుంచి వెళ్ళిపోయారు.

o o o

ఆనాటి నుంచి శాస్త్రిగారి మీద కక్ష సాధించడానికి హెడ్‌మాస్టరు గారు ఎన్నో ప్రయత్నాలు ప్రారంభించారు. తన అభిమానుల సంఖ్య పెంచడానికి కృషి చేశారు. ఆయన మీద కమిటీవారితో ఏవేవో పితూరీలు చెప్పారు. కార్యదర్శిగా ఉండి శాస్త్రిగారు నిర్వహిస్తున్న ఉపాధ్యాయ సహకార సంఘాన్ని గురించి, ఉపాధ్యాయ మహాసభలో ఆయన వహించిన పాత్రను గురించి విమర్శించడం, లేనిపోని అభాండాలు వెయ్యడం సాగించారు.

శాస్త్రిగారు ఇదేమీ పట్టించుకోలేదు. హెడ్‌మాస్టరుగారు అంటున్నమాటలు వినిపించినా, వినిపించనట్లు నటించి తగవురాకుండా తప్పించుకొని పోవడం చూచి మేమంతా ఆశ్చర్యపడ్డాము.

కాని శాస్త్రిగారు ఊరుకొన్నా, హెడ్‌మాస్టరుగారు మాత్రం ఊరుకోలేదు. ఒకసారి శాస్త్రిగారు పది నిమిషాలు ఆలస్యంగా వచ్చేసరికి నానా హడావిడీ చేసి ఉపాధ్యాయుల గది దగ్గరే కాపువేసి ఆయన వచ్చిరాగానే "ఏమండీ, శాస్త్రిగారూ, ఇంత ఆలస్యంగా వచ్చారూ? మీరు స్కూలు విషయం శ్రద్ధ వహించక సహకార సంఘం అంటూ అనవసరపు పనులన్నీ నెత్తిన వేసుకు తిరుగుతున్నారు. పోనీ, అదే

మీకు లాభదాయకంగా ఉంటే. ఇంక ఈ ఉద్యోగం ఎందుకండీ ?'' అన్నారు.

శాస్త్రిగారు నవ్వుతూ "మంచిమాట అన్నారు. మీనోటి వాక్యాన అది లాభదాయకమైతే ఈ ఉద్యోగం మానెయ్యవచ్చు" అని వెళ్ళి పోతుంటే హెడ్‌మాస్టరుగారు "ఏం గిట్టుబాటు కావడంలేదా ?" అన్నారు.

శాస్త్రిగారు అప్పటికీ నవ్వుతూనే "మరే'' అంటూ ముందుకు సాగారు.

"అదేమిటి అలా సెలవిస్తున్నారు. ! దిట్టంగా సంపాదిస్తున్నారని విన్నానే ?'' అంటూ హెడ్‌మాస్టరుగారు అభాండాలు వెయ్యడానికి సిద్ధపడే సరికి, శాస్త్రిగారు వెనుదిరిగి ఒక్క క్షణం ఆగి "మరీ కుర్రతనంగా మాటాడకండి. ఇదేం స్కూలు డబ్బుకాదు కాజేయడానికి అని నేనంటే మీరు బాధపడతారు. పిల్లి కళ్ళుమూసుకొని పాలుతాగుతూ, తన్నెవ్వరూ చూడలేదనుకొంటుందట. కాని అదే నయం. దానికి దొరికిని కాసిని పాలు తాగేసి చక్కాపోతుంది. ఇతరులెవ్వరో తాగేస్తున్నారని అభాండాలు వెయ్యదు. అయినా మీ విషయం నాకు అనవసరం. అడిగారు కనుక నా విషయం చెబుతాను. ఇది మంది సొమ్ము. నయాపైసల దగ్గరనుంచి సరయిన లెక్కచూపాలి. అన్నిటికీ మించి ఇది బీదవారైన తోటి ఉపాధ్యాయుల సొమ్ము. ఏదైనా పొరపాటు జరిగితే నలుగురూ నన్ను నిల వేస్తారు, అదలా ఉంచండి. నాకు నిజంగా వ్యాపారం చెయ్యాలనీ, బాగా డబ్బు గడించాలనీ ఉంటే సొంత వ్యాపారం పెట్టుకోగలను ఇంక ఈ వివరణ మానేస్తాను. అయినా చెప్పుడు మాటలు వినకండి స్వామీ అంటే వినరుకదా ?" అని ఆయన సమాధానం కోసం ఆగకుండా చెర చెరా తమ తరగతికి వెళ్ళిపోయారు.

శాస్త్రిగారు వెళ్ళిపోయాక హెడ్‌మాస్టర్‌గారు ఎన్నెన్నో అన్నారు. "గుమ్మడికాయల దొంగ అంటే బుజాలు తడుముకున్నాడట వెనుకటి ఒక పెద్దమనిషి" అంటూ శాస్త్రిగారిని విమర్శిస్తూ పాత జోక్సు, విట్సు వేసి, నవ్వేవారు లేకపోయేసరికి తనే పెద్దగా నవ్వి ఒక సారి అందరివంకా చూచి నిరుత్సాహపడి వెళ్ళిపోయారు తమ గదికి.

ఇక ఆ క్షణం నుంచి ఆయనకు శాస్త్రిగారిమీద పగ ఏర్పడింది. వెళ్ళితియ్యలేకపోయానే అని ఊరికే మధనపడడం ప్రారంభించారు. తన వర్గం మనుషులను తరుచు సమావేశపరిచి పగసాధించే మార్గాలు వివరించారు. కృష్ణయ్యగారూ, రావుగారూ ప్రోద్బలమానం ఆయనకు చెరో ప్రక్కనా చేరి మంట చల్లారకుండా అప్పుడో నాలుగు, అప్పుడో నాలుగు సమిధలు వేస్తూ వచ్చారు.

హెడ్‌మాస్టర్‌గారు పాఠశాల నిర్వహణలో తనతో ఎవరూ సహకరించడం లేదని అదే పనిగా సణగడం మొదలుపెట్టారు. ఆ మాటలే కృష్ణయ్యగారి నోటివెంటా, రావుగారి నోటివెంటా కొంచెం హెచ్చు స్వరంలో వినిపించసాగాయి. ఈ ఆర్భాటానికి కొంత కారణం లేక పోలేదు.

శాస్త్రిగారు పూర్వంనుంచీ పాఠశాల అభ్యున్నతి కోరి ఒకరు చెప్పినా, చెప్పకున్నా అనేకమైన పనులు చేసిపెట్టేవారు. మంచి మాటలు చెప్పి, మా అందరిచేత కూడా పనులు చేయించేవారు. టైమ్‌టేబిల్ వెయ్యడం, పరీక్ష పేపర్లు ఏయే తరగతికి ఎన్నికావాలో లెక్కకట్టడం, ఆఫీసు రికార్డులలో కూడికలు, తీసివేతలు సరిగా ఉన్నాయో లేదో చూడడం మొదలైన పనులు నేను చూచేవాణ్ణి. ఇంగ్లీషులో జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలకు సంబంధించిన వ్యవహారమంతా రామారావు మాస్టర్‌గారు చూచేవారు. శాస్త్రిగారు పరీక్షలు నిర్వహించడానికి సంబంధించిన పను

లన్నీ స్వయంగా చూచేవారు పాఠశాల మొత్తంమీద ఎక్కడా ఎవ్వరూ కాపీ కొట్టకుండా కట్టుదిట్టం చేసేవారు. మామూలు స్కూలు పరీక్షలు కూడా ఒక యజ్ఞంలా నిర్వహించే వా రాయన. హెడ్‌మాస్టర్‌గారు "ఓ కే," "థాంక్స్" అంటూ ఉండడంతో సరిపోయేది.

అది పూర్వపు పరిస్థితి. అటువంటి స్థితి సాగనీయడంచేతనే శాస్త్రి గారికి పలుకుబడి పెరుగుతున్నదనీ, అందువల్లనే ఆయనకు "అహం కారం" వచ్చిందనీ హెడ్‌మాస్టర్‌గారు దురభిప్రాయపడ్డారు. అన్ని పనులూ తానే స్వయంగా నిర్వహించడానికి పూనుకొన్నారు. అందుకు కావలసిన సామర్థ్యం ఉంటే అంతా బాగానే ఉండేది. ఆయనలో లోపించిందల్లా అది ఒక్కటే. అసమర్థతను కప్పిపుచ్చుకోడానికి విసుగు, కోపం ప్రదర్శించడం, ఆ కారణంగా వారిమీదా, వీరిమీదా విరుచుకొని పడడం, పెద్ద బరువు భారంతో, బృహత్తరమైన బాధ్యతలతో సతమత మవుతున్నట్లు నటించడం, కొందరు తనతో సహకరించడంలేదని విమర్శించడం ఎక్కువ అయేసరికి మాకూ అసహ్యం వేసింది. 'తమతో సహకరించడమంటే తమవెంటపడి తిరుగుతూ చెప్పినా చెప్పకపోయినా, విసుక్కొన్నా, కసురుకొన్నా తమరు చెయ్యవలసిన పనులన్నీ చేసి పెట్టడమేనా?' అని ఒకసారి అడిగివద్దామనిపించింది నా మట్టుకు నాకు.

o o o o

అర్థ సంవత్సరపు పరీక్షలు వచ్చాయి. మా మీద నమ్మకంలేక పరీక్షాపత్రాలన్నీ మా హెడ్‌మాస్టర్‌గారూ, కృష్ణయ్యగారూ, రావుగారూ కలిసి స్టెన్సిళ్ళమీద వ్రాసి, సైక్లోస్టైల్ చేయించడానికి పూనుకొన్నారు.

ఈ పనికి కొంతమంది బడిపిల్లల సహాయం కోరారట హెడ్‌మాస్టర్ గారు. వాళ్ళు ముందుకు వచ్చేసరికి "కొంతమంది ఉపాధ్యాయులకంటే మీరేనయం'' అని వాళ్ళను ఉబ్బేసి వాళ్ళచేత పని చేయించుకొన్నారట. అంతవరకు బాగానే ఉంది. అలాఅని మేముకూడా అనుకొన్నాము. కాని

తీరా పరీక్షలు ప్రారంభమైన నాడు ఊళ్లోనూ, పాఠశాలలోనూ, గోడల మీదా, నల్లబల్లలమీదా ఎక్కడచూస్తే అక్కడ పరీక్షాపత్రాలు ప్రత్యక్ష మయాయి. పైగా ఆ పత్రాలక్రింద వెంకట్రావుగారి సహాయంతో, కృష్ణయ్యగారి సహాయంతో అని సిరాతో వ్రాశారు.

హెడ్మాస్టర్‌గారు స్కూలంతా చిందులు తొక్కారు. వాళ్ళమీదా, వీళ్ళమీదా కేకలు వేశారు. కృష్ణయ్యగారినీ, వెంకటరావుగారినీ పిలిచి "మీరింత అసమర్థులని అనుకోలేదు" అంటూ తిట్టిపోశారు. వారిని వెంట పెట్టుకొని ఉపాధ్యాయుల గదికి వచ్చి నానా హంగామా చేశారు. పెద్ద అల్లరి అయిపోయింది. తమ ప్రతిష్ఠకు భంగకరమని ఆయినా అనుకో కుండా జరిగినదంతా రిపోర్టు చేస్తే సెక్రటరీగారు స్వయంగావచ్చి మా అందరిచేతా మళ్ళీ ప్రశ్నపత్రాలు వ్రాయించి,ప్రతులు తయారు చేయించి, పంపకం జరిపించి వెళ్ళారు.

వెళ్లేముందు ఆయన హెడ్‌మాస్టర్‌గారితో "మీరు పరీక్షలు కూడా నిర్వహించలేరా? ఈ భాగ్యానికి నన్ను పిలవకపోతే శాస్త్రిగారిని సాయం అడక్కపోయారా ?'' అన్నారు.

దానితో హెడ్‌మాస్టర్‌గారికి కోపం వచ్చింది. తనముందు శాస్త్రి గారిని ప్రశంసించేసరికి ఆయనకు ఉక్రోషంకూడా వచ్చింది. అది చెప్పి పుచ్చుకొని వెంటనే "ఆయన్నెలా పిలుస్తానండీ. ఈ అప్రతిష్ఠకు కారణం ఆయనేగా. ఏదోవిధంగా నన్ను అల్లరిపెట్టాలనే ఆయన ఈ పాడుపని చేశారు'' అన్నారు.

హెడ్‌మాస్టర్‌గారు ఆరోజు సాయంత్రం ప్రెసిడెంట్‌గారి ఇంటికి వెళ్ళి శాస్త్రిగారి మూలంగానే పరీక్షాపత్రాలు బయటపడ్డాయనీ, ఆయన మూలంగానే బళ్లో క్రమశిక్షణ నశించిపోతున్నదనీ ఫిర్యాదుచేశారు. ప్రెసిడెంటుగారు అంతా విని "బలమైన సాక్ష్యాధారాలు లేకుండా మీరిలా అనడం భావ్యంగా లేదు. మీరు వెళ్లిరండి'' అని సాగనంపారట.

హెడ్‌మాస్టర్‌గారికి ఆ మోతాదు చాలలేదు. పైపెచ్చు సాక్ష్యం సంపాదించి, శాస్త్రిగారిని దండిద్దాం అని ప్రెసిడెంటుగారు అన్నట్లు భావించుకొని, తనంతటతానే ప్రోత్సాహం కల్పించుకొని, తాను శాస్త్రిగారి మీద చేసిన ఆరోపణలకు సాక్ష్యాలు, ఆధారాలు కల్పించడానికి వెంటనే ప్రయత్నం ప్రారంభించారు. కక్ష సాధించడానికి అది మంచి అవకాశం అనుకొన్నారు.

ఆ ప్రయత్నం ఫలప్రదం కాకముందే ఆయన శాస్త్రిగారితో ముఖాముఖి యుద్ధానికి సిద్ధపడ్డారు.

ఉపాధ్యాయుల సమావేశంలో హెడ్‌మాస్టర్‌గారు ఏదో సాధారణ విషయం ప్రస్తావిస్తున్నట్లు మొదలుపెట్టి అంతలో దురుసుతనం ప్రదర్శిస్తూ "తప్పులు చెయ్యడం ఎవరికైనా సహజమే కాని, కనీసం బయటపడ్డాకయినా క్షమాపణ వేడుకోవడం ఉత్తముల లక్షణం" అన్నారు శాస్త్రిగారివంక తీక్ష్ణంగా చూస్తూ.

శాస్త్రిగారు మరోవైపు చూస్తూ ఉండిపోయేసరికి ఆయన "మీరేమంటారండీ, శాస్త్రిగారూ" అని రెట్టించి అడిగారు.

"ఇందులో నేనేమంటానండీ. అవును, కరెక్ట్ అంటాను" అన్నారు శాస్త్రిగారు.

హెడ్‌మాస్టర్‌గారు వెంటనే అందుకొని "అది మీ విషయమే అనుకోండి. అప్పుడేమంటారు?" అన్నారు.

"నా విషయమైనా అంతే, మరొకరి విషయమైనా అంతే" అని వెంటనే సమాధానం చెప్పారు శాస్త్రిగారు.

దారిలోకి వచ్చారనుకొంటూ హెడ్మాస్టరుగారు "అన్నంత తేలిక కాదండీ. శాస్త్రిగారూ! ఒకవేళ మీరే తప్పు చేశారనుకోండి, వెంటనే క్షమాపణ చెప్పుకోడానికి సిద్ధపడతారా?" అన్నారు.

"చెప్పాను కదండీ, రంగారావుగారూ ? అయినా ఎందుకీ ముసుగులో గుద్దులాట. అసలు విషయం చెప్పండి. నే నేమిటి తప్పుచేశాను ? అందరం ఇక్కడే ఉన్నాము కనుక, అదేదో ఇప్పుడే తేల్చుకోవచ్చు" అన్నారు శాస్త్రిగారు నిదానంగా.

హెడ్ మాస్టర్‌గారు వెంటనే అందుకొని "అంత ఏమీ తెలియనట్లు మాటాడకండి. నామీద కోపం చొప్పున కుర్రముూకను దగ్గరకు చేర్చి పరీక్ష పేపర్లు అందరికీ చెబుతారా ? ఇది తప్పుకాదూ ? ఇందుకు మీరు క్షమాపణ చెప్పుకోనక్కర్లేదే?'' అన్నారు.

శాస్త్రిగారు నెమ్మదిగాలేచి నిలబడి "అయ్యా, హెడ్మాస్టర్‌గారూ నా కీ లౌక్యాలూ, అవీ సరిగా అర్థంకావు. అంతకంటే ముఖ్యంగా పగ సాధించడం అంటే నాకు బొత్తిగా గిట్టదు. 'పగయడగించు టెంతయు శుభంబు' అన్నారు తిక్కనగారు. అది మంచి హితోక్తి, అందువల్ల పగ వద్దంటున్నాను. అది మన ఉభయులకూ శ్రేయస్కరం కాదు. మీరు తొందరపాటుని పొరపాటు మాటలు మాటాడేస్తున్నారు. మీ పొరపాటు క్షమింపదగిన వయస్సు నాకున్నది కనుక ఈ విషయం ఇంతటితో వదిలేస్తాను. ఒక్క షరతు. ఆధారరహితమూ, మిక్కిలి అన్యాయమూ అయిన మీ నిందారోపణ వెంటనే ఉపసంహరించుకోవాలి'' అన్నారు శాస్త్రిగారు గంభీరంగా.

హెడ్ మాస్టర్‌గారు "ఏమందోయ్, ఏదో చమత్కార సంభాషణ ప్రారంభించారే! తప్పు చేశారుకదా, క్షమాపణ చెప్పుకొంటారా లేదా అని నే నడిగితే నే నేదో క్షమాభిక్ష వేడుకోవాలన్నట్లు మాటాడేస్తున్నారే?" అన్నారు విషపునవ్వు నవ్వుతూ – కోపంగా చూస్తూ.

శాస్త్రిగారు కండువా భుజంమీద వేసుకొని, గొంతు సవరించుకొని "ఇప్పుడర్థమైంది, ఏదో అన్యాపదేశంగా మాటాడుతున్నారని అను

కొన్నాను. సరే. అన్నదేదో అన్నారు. ఉపసంహరణ ప్రసక్తి లేదు కనుక రుజువు చెయ్యండి" అన్నారు.

హెడ్‌మాస్టర్‌గారు ఈసడింపుగా "ఏమిటండీ రుజువుచేసేది? ఇల్లాంటివాటికి రుజువు లేముంటాయి? అందుకేగా మీకీ దుర్బుద్ధిపుట్టింది? ఎంతవయస్సు వస్తేమాత్రం ఏంలాభం?'' అని ఇంకా ఏదో అనబోతుంటే శాస్త్రిగారు అడ్డువచ్చి "రంగారావుగారూ, ఒక్క మాట వినండి. ఇప్పటిదాకా మీ పదవిని గౌరవించి మీరన్నమాటలు పడ్డాను. రుజువు చెయ్యమనీ, రుజువు లేకుండా ఇలాంటి ఆరోపణలకు దిగవద్దనీ మనవి చేశాను. కాని మీ ధోరణి బాగా లేదు. ఏదో విధంగా కక్ష సాధిద్దామనీ, నన్ను వాగించాలనీ చూస్తున్నారు. ఇంక ఒక్కమాట సహించను. మీ మర్యాద మీరు కాపాడుకోండి'' అన్నారు.

హెడ్‌మాస్టర్‌గారికి పట్టరాని ఆగ్రహం వచ్చేసింది. వెనకా ముందూ చూచుకోక కోపంగా, పెద్దగా "షటప్'' అని అరిచారు.

శాస్త్రిగారు గబగబా ముందుకువెళ్ళి ఆయన ఎదుట నిలబడి "హెడ్మాస్టర్‌గారూ, కొంచెం మర్యాద నేర్చుకోండి మీరుగాని, నేను గాని బజారు మనుష్యులం కాము. ఆ విషయం మరిచిపోకండి. 'షటప్' అంటే 'యూ షటప్' అనే ధైర్యం నాకు లేక కాదు ఊరుకొనేది. అది మన సంస్కారానికి అడ్డు వస్తుంది. దీనిమీద మాటలు పెంచను మీకో నమస్కారం. నేను వెళుతున్నా. మీరు కమిటీవారితోనూ, ప్రభుత్వం వారితోనూ చెప్పి, నా తప్పేదో రుజువు చేసుకొని, నామీద అవసరమైన చర్య తీసుకోండి" అని ఆయన చెరచెరా వెళ్ళిపోయారు.

o o o o o

సరిగా ఆ మరునాడే మా హెడ్‌మాస్టర్‌గారు ముందుగా ఎవ్వరికీ కాగితంమీద రిపోర్టు వ్రాసి పంపకుండానే, ఏ విషయమూ రుజువు చేయ

కుండానే స్కూలు సెక్రటరీ గారితో లాలూచీఅయి శాస్త్రిగారిని ఉద్యోగం నుంచి తీసివేస్తున్నట్లు 'ఆర్డరు' పుట్టించారు. మేమంతా భయభ్రాంతుల మయ్యాము.

కాని శాస్త్రిగారు మాత్రం తొణకలేదు, బెణకలేదు.

ఆయన మా అందరితోపాటు ఉపాధ్యాయుల గదిలో ఉండగా ఆ ఉత్తరువు పుచ్చుకొని బడినౌకరు వచ్చాడు. అది ఆయనకు స్వయంగా అందజేసి "తమరేదన్నా మాట్లాడవలసింది ఉంటే వచ్చి మాట్లాడమన్నా రండి'' అని చెప్పి వెళ్ళాడు.

శాస్త్రిగారు ఉత్తరీయం భుజాన వేసుకొని, ఆ ఆర్డరు కాగితం చేతపుచ్చుకొని, ఒక్కమాటైనా అనకుండా ఇంటికి చక్కాపోయారు.

ఈ దౌర్జన్యాన్ని అరికట్టడం ఎలాగా అని మేమంతా ఎంతో మధనపడ్డాము. ఎంతో చర్చించాము. సాయంకాలం నలుగురమూ కలిసి సెక్రటరీగారి ఇంటికి వెళ్ళి, ఇది అన్యాయమనీ, శాస్త్రిగారి కీ విషయంలో ఎటువంటి ప్రమేయంలేదనీ, ఇది నియమ నిబంధనలకు విరుద్ధమనీ మనవి చేశాము.

"అవన్నీ హెడ్మాస్టర్‌గారు చూచుకొంటారు. నాకేం తెలియదు'' అన్నారాయన అక్కడనుంచి ప్రెసిడెంట్‌గారి ఇంటికి వెళ్ళాము కాని ఆయనకూడా చెప్పిందంతా విని "వాళ్ళుకూడా అన్ని విషయాలూ చెప్పి వెళ్ళారు. ఈ దశలో నేను ప్రమేయం పెట్టుకోవడం బాగుంటుందా? అయినా మీరు ఇంతమంది వస్తున్నారు. అసలు మనిషి ఆ శాస్త్రిగారు ఎందుకు రారు? పోనీ, ఆయనవస్తే ఆ హెడ్మాస్టర్ కుర్రాణ్ణి కూడా పిలిపించి ఏదో విధంగా రాజీ చేద్దునుగా'' అన్నారు.

ఆ మాటమీద ఏదో ఆశ కలిగి శాస్త్రిగారి ఇంటికివెళ్ళి జరిగినదంతా ఆయనకు వివరించి చెప్పాము. చివరకు నేనే ధైర్యంచేసి "ఏమండీ,

శాస్త్రిగారూ! మీరూ, ప్రెసిడెంటుగారూ చిరకాల మిత్రులు. ఒకసారి వెళ్ళివస్తే...'' అని సూచించాను. శాస్త్రిగారు విని ఊరుకొన్నారు

చివరకు అది ఒక కేసు అయింది. డి.ఇ.ఒ. ఆఫీసునుంచి హెడ్ మాస్టర్‌గారికి సంజాయిషీ చెప్పుకోవలసిందిగా కోరుతూ పత్రాలు వచ్చాయి. హెడ్‌మాస్టర్‌గారు ఉన్నవీ, లేనివీ పది కల్పించి శాస్త్రిగారు ఉపాధ్యాయులు హెడ్మాస్టరుపై ఎదురు తిరిగేలా చేశారనీ, స్కూల్లో క్రమశిక్షణ లోపించడానికి ఆయనే ప్రధాన కారణమనీ, ఆయన పరీక్ష పత్రాలు బయటపెట్టి పాఠశాల ప్రతిష్ఠ పోగొట్టారనీ, అదేమని తాను అడిగితే ఉపాధ్యాయులందరి సమక్షంలోను తన్ను నానామాటలూ అని చాలా అవినయంగా, అమర్యాదగా, అసభ్యంగా ప్రవర్తించారనీ రిపోర్టు వ్రాశారు. రావుగారూ, కృష్ణయ్యగారూ అందుకు సాక్షి సంతకాలు చేశారు.

అటు తర్వాత శాస్త్రిగారు కోర్టుకు వెళ్ళక తప్పలేదు. నేను పట్నంవెళ్లి ప్లీడరుగారితో మాటాడి కేసు ఒప్పగించి వచ్చాను.

ఆ వచ్చిన క్షణంనుంచి హెడ్‌మాస్టర్‌గారు నామీద కారాలూ మిరియాలూ నూరడం ఎక్కువైంది. ఒకసారి ఆలస్యంగా వచ్చాననీ, మరోసారి ముందుగా వచ్చికూడా క్లాసుకు ఆలస్యంగా వెళ్ళాననీ, అవనీ, ఇవనీ సాధింపు మొదలుపెట్టారు. నాకు 'ఎక్స్ట్రాప్రిపరేషన్' వెయ్యడం మరీ ఎక్కువైంది. కావాలని తన అభిమానులను అక్కడికీ ఇక్కడికీ పంపి, వాళ్ళ తరగతులకు నన్నుపంపడం, వాళ్ళు చెప్పే పాఠాలుకూడా నేను చెప్పాలని పట్టుపట్టడం మొదలుపెట్టారు.

హెడ్‌మాస్టర్‌గారు నన్నేకాదు, తనపక్షం వహించడంలేదని అనుమానం కలిగినవారిని అందరినీ ఇదేవిధంగా వేధించడం మొదలు పెట్టారు. శాస్త్రిగారి కేసుకు సంబంధించిన వ్రాతకోతలన్నీ రామారావు

పోయింది. మా బళ్ళో ప్రాథమిక తరగతులకు వెళ్ళే ఉపాధ్యాయులను ఆయన మరీ మూడలగొట్టారు. వాళ్ళముందు 'వసారా ఉపన్యాసాలు' ఎక్కువయాయి. దీనికితోడు ఆయన దన్ను చూచుకొని, ఆయన బల హీనత ఆసరా చేసుకొని రావుగారూ, కృష్ణయ్యగారూ విచ్చలవిడిగా మా కెదురేముటి? అన్నట్లు ప్రవర్తించారు వారిద్దరూ క్లాసులకు వెళ్ళడమే మానివేశారు. ఎంతసేపూ హెడ్‌మాస్టరుగారి గదిలో కూర్చొని ఆయని గారితో ఆ మాస్టరు ఇలా అన్నాడనీ, ఈ మాస్టారు అలా అన్నాడనీ పితూరీలు, ఎవరెవరో కుట్రలు పన్నుతున్నారనీ, ముందుగా కుట్రలు భగ్నం చేయాలనీ హెచ్చరికలు చెయ్యడం వారి పని అయిపోయింది.

అక్కడ వ్యవధి చాలక, వారు ఇద్దరూ హెడ్‌మాస్టర్‌గారి ఇంటికి వెళ్ళేవారు. పొద్దుట, సాయంత్రం బజార్లలో కూడా ఆయనవెంట వారిద్దరూ ఏదో గుసగుసలాడుతూ కన్పిస్తుండేవారు. వాళ్ళు చెప్పేవన్నీ నమ్మేవారు మా హెడ్‌మాస్టర్‌గారు. అలా నమ్మి, నన్ను కొన్నిసార్లు ప్రత్యేకంగా పిలిపించి "ఏదో కుట్ర జరుగుతున్నదటగా, నామీద ?'' అని అడిగారు.

అలాంటప్పుడు నాకు నవ్వూ వచ్చేది, చిరాకూ పుట్టేది. అటువంటి దేమీ లేదని సర్ది చెప్పేసరికి నా తల ప్రాణం తోకకు వచ్చేది.

అలా ఆయన దగ్గరకు వెళ్లిన ప్రతి సందర్భంలోనూ నేను ఆ అవకాశం వినియోగించుకొని శాస్త్రిగారి విషయం ప్రస్తావించి అది మంచి పని కాదనీ, ధర్మం కాదనీ, ఎంతటివారికైనా పట్టువిడుపులు ఉండాలనీ, తెగేదాకా లాగటం కనీసం లౌక్యం కాదనీ ఎన్నో విధాల మనవి చేశాను. కాని ఆయన వినలేదు.

క్రింద కోర్టులో ఆయనకు గెలుపు లభించేసరికి అంతిమవిజయమే లభించినంతగా పొంగిపోయారు. స్కూలులో సొంత ఖర్చుతో టీపార్టీ చేశారు. దానికి నేను హాజరుకానందుకు ఆ మరునాడు నామీద మండి పడ్డారు.

శాస్త్రిగారు కేసు హైకోర్టుకు తీసుకొని వెళ్ళారు. కేసు హైకోర్టుకు వెళ్ళడంతో కక్ష సాధిద్దామనుకొన్న హెడ్‌మాస్టర్‌గారికీ, ఏదో తన ఆశ్రితుడైన హెడ్‌మాస్టర్ పరువు కాపాడడానికి ప్రాకులాడుతున్న సెక్ర

టరీగారికీ, తమాషా చూద్దామనుకొంటూ వచ్చిన కొంతమంది స్కూలు కమిటీ మెంబర్లకూ గుండెల్లోరైళ్ళు పరుగెత్తాయి "క్రిందకోర్టులో అయితే వాళ్ళనూ, వీళ్ళనూ పట్టుకొని వ్యవహారంలో పైచెయ్యి అనిపించుకొని రాగలిగాము కాని, హైకోర్టులో నెగ్గడం ఎలా" అని వారంతా దిగులు పడ్డారు కూడా. దీనికితోడు ఈ కోర్టు తగాదాకు అయ్యే ఖర్చు స్కూలు శాశ్వత నిధులనుంచి భరించడానికి వీల్లేదని ప్రెసిడెంటుగారు ఆంక్ష పెట్టే సరికి, వారంతా మరీ ఇరకాటంలో పడ్డారు. ఆయన ఇంకోమాట కూడా అన్నారు: "శాస్త్రిగారి డబ్బు ఖర్చు అవుతున్నదంటే నాకు మనస్సులో కష్టంగా ఉన్నది. అది వేరే విషయం. ఆ డబ్బు వ్యక్తిది. కాని ఇది మందిది. ఊళ్ళో పిల్లలకు విద్యాసౌకర్యం కల్పించడానికి కష్టపడి ఈ సొమ్ము పోగుచేశాము కాని, హైకోర్టులో వ్యాజ్యాలాడడానికి కాదు.''

పాఠశాల తరఫున వాదించడానికి, కేసు నడపడానికి హైకోర్టు లాయరుకు పెద్ద మొత్తం ఫీజు ఇవ్వవలసి వచ్చింది హెడ్మాస్టర్‌గారు చిక్కుసమస్యే ఎదుర్కోవలసి వచ్చింది అందులోనూ ఒంటరిగా.

ఆయన ఒక పథకం వేశారు. సైన్సు మాస్టరుగారు సెలవుమీద ఉండటం ఆ పథకం వెంటనే అమలు జరపడానికి మరింత అనుకూలించింది. పాఠశాల ప్రయోగశాలలో వాడుకనిమిత్తం ఒక్కసారే రెండు సూక్ష్మదర్శినులు. బడిపిల్లలకు వినోదం కల్పించేందుకు ఒక మంచి రేడియో కొన్నామన్నారు. వాటి తాలూకు రశీదులు మాత్రం రైటరుగారు మా అందరికీ చూపించారు అకారణంగా. రెండోవారంలో అవి మూడూ పోయాయన్నారు. ఎవరో దొంగలు ఎత్తుకుపోయారంటే అంత రభస కాకపోను. ప్రయోగశాల నౌకరుమీద ఆ నేరం మోపి, అతన్ని పిలిపించి హెడ్‌మాస్టర్‌గారు గుడ్లెర్రజేసి, తిట్టి ఉద్యోగంనుంచి తీసివేస్తానని బెదిరించి తనే వెళ్ళి రిపోర్టు ఇచ్చి రావడంతో గొడవ జరిగింది.

హెడ్‌మాస్టరుగారు కనీసం కృష్ణయ్యగారినీ, రావుగారినీ కలుపుకోవలసింది ఈ వ్యవహారంలో. ప్రెసిడెంటుగారు వారి నిద్దరినీ విడివిడిగా పిలిచి అడిగితే తా మా వస్తువులు బళ్ళో ఎక్కడా చూడనేలేదని చెప్పివచ్చారు. దానితో అసలు సంగతి బయటకు వచ్చింది. ఆ వస్తువులు కొన్నట్లు దొంగరశీదులు పుట్టించి, ఆ డబ్బు ప్లీడరుకు ఇచ్చి వచ్చి అవి

పోయాయనీ, నౌకరు కాజేశాడనీ హెడ్మాస్టరుగారు అంటున్నారని అంద రికీ అనుమానం కలిగింది.

ప్రెసిడెంటుగారు నన్ను పిలిపించారు. నేను వెళ్ళాను ఆ వెళ్ళడం మా హెడ్‌మాస్టరుగారు చూచారు. "నిజానిజాలు నాకు తెలియవు. మీరు స్వయంగా విచారించండి" అని. ప్రెసిడెంటుగారి దగ్గరనుంచి వెంటనే బయటపడగలిగాను కాని, మా హెడ్‌మాస్టరుగారి వద్దనుంచి మాత్రం అంత సులభంగా బయటపడలేకపోయాను.

నేను అక్కడినుంచి వచ్చి రాగానే నన్ను మా హెడ్‌మాస్టరుగారు తన గదికి పిలిపించడం, "ప్రెసిడెంటుగారు తమర్నేమడిగారండీ? తమ రేం చెప్పారండీ?" అంటూ గుచ్చిగుచ్చి ప్రశ్నించడం జరిగింది. నేను జరిగింది చెప్పాను. ఆయనతో అన్న ఆ రెండుమాటలూ ఈయనకూ చెప్పాను.

"నిజానిజాలు నాకు తెలియవని వచ్చేస్తారా? ఇదేనా మీరు నా ఎడల చూపవలసిన మర్యాదా, కృతజ్ఞతానూ? అవకాశం వచ్చినప్పుడు ఆయనకు మీనాద కలిగిన అనుమానం పోగొట్టడానికి మీరు శాయశక్తులా ప్రయత్నించవద్దూ? ఇదేనా మీరు చేసే ఉపకారం?'' అంటూ నామీద కోపం ప్రదర్శించడం ప్రారంభించారు.

ఒకసారి ఆయనవంక చూచాను. ఆయన నిజంగానే కోపంతో వణికిపోతున్నారు. ఆయన ధోరణి, ఆయన వాలకం చూస్తే నాకు అస హ్యమూ వేసింది, జాలీ కలిగింది. ఆ కోపం, ఆ వణకడం అదీ ఒక విధమైన దౌర్బల్యమని నా విశ్వాసం. అందుకే నాకు జాలి కలిగింది.

వాస్తవానికి ఆయనమీద కక్ష సాధించడానికి నాకది మంచి అవ కాశం. ప్రెసిడెంటుగారితో బళ్లో అందరూ అనుకొంటున్న మాటలు చెప్పి ఆయన అనుమానం ధృవపరచడానికి గొప్ప అవకాశమే లభించింది. కాని అది పద్ధతికాదనీ, శాస్త్రిగారు అనుక్షణం బోధించే పగసాధించడం మంచిదికాదన్న సిద్ధాంతం అసలు జరపాలనీ అనుకోవడంచేత అటు వంటి ఉద్దేశాన్ని మనస్సులోకి రానివ్వలేదు. అయినా మా హెడ్‌మాస్టరు గారికి నాయందు సదభిప్రాయం కలగలేదు.

"మీ రెందుకో అకారణంగా కోపగించుకొంటున్నారు. ఆ గొడవేదో మీరూ, మీరూ చూచుకోండి'' అని నేను లేచి వెళ్ళబోతుంటే ఆయన పెద్దగా "మాటిమాటికి ఇదొకటి నేర్చుకొన్నారు—మాటమధ్యలో లేచిపోవడం. భయం, భక్తీ ఉన్నవాళ్ళెవరరూ ఇలా చెయ్యరు. మొదటినుంచీ మీ ప్రవర్తన ఇలాగే ఉన్నది. మేము ఉద్యోగంనుంచి బర్తరఫ్ చేసిన శాస్త్రిగారిని వెనకేసుకొస్తూ ధర్మపన్నాలు చదివారు. నాకు వ్యతిరేకంగా పనిచేస్తున్న ఉపాధ్యాయ సంఘానికి కార్యదర్శి అయ్యారు. ఇవ్వాళ ఆయన పిలిస్తే వెళ్ళి, నామీద మరింత అనుమానం కలిగేలా మాట్లాడి వచ్చారు. అదేమండీ అంటే చప్పుడుకాకుండా జారుకొంటున్నారు. ఇదేమన్నా పెద్దమనిషి తరహాగా ఉన్నదా అంటాను. నిజానిజాలు తెలియవంటే అర్థం ఏమిటి? అసలు మీరు నాతో సంప్రదించకుండా, నా అనుమతి లేకుండా ఇక్కడ పని వదిలిపెట్టి ఆయనగారి దగ్గరకు ఎలా వెళ్ళారు? మీ కసలు సెన్సు ఉన్నదా'' అంటూ రెచ్చిపోయి అసభ్యంగా సందర్భా సందర్భాలులేకుండా కేకలు వెయ్యటం, మాటలు తూలడం మొదలుపెట్టారు.

ఆయన కుసంస్కారం చూచేసరికి నాకు నవ్వువచ్చింది. ఆశ్చర్యం వేసింది ఎవరో విద్యాగంధం లేనివాళ్ళు అలా ప్రవర్తించడం చూచాను. అటువంటి సందర్భాలను గురించి విన్నాను. కాని బాధ్యత, గౌరవం కల పదవిలో ఉన్న మనిషి, అందులో ఉపాధ్యాయుడు, మీదుమిక్కిలి ప్రధానోపాధ్యాయుడు ఇలా ప్రవర్తించడం ఎంతో ఎబ్బెట్టుగా కనిపించింది. ఏహ్య మనిపించింది కూడానూ.

ఆ మనిషికి సమాధానం చెప్పడం నా గౌరవానికి, సంస్కారానికి భంగకరమనిపించి, వెంటనే లేచి "నమస్కారమండీ. మీ ప్రవర్తన, మీ ఎతులు, మీ మాటలు నాకు అర్థం కావడంలేదు'' అని బయటకు దారి తీశాను.

అంతలో మా హెడ్‌మాస్టరుగారు చాలా విచిత్రమైన పని చేశారు. గబగబా నాకంటె ముందు నడిచి గుమ్మందాకా వచ్చి పెద్దగా "ఏమిటీ, నన్ను రాస్కెల్, ఫూల్ అంటారా? అని, దొంగలా దాటుకోవాలని

చూస్తున్నారా? అరే ప్యూన్, మిస్టర్ రైటర్! ఈయన్ను బయటకు గెంటండి'' అని కేకలు పెట్టాడు.

అంత హఠాత్తుగా ప్లేటు మార్చి నాటకం ఆడేసరికి, నేను నిర్ఘాంతపోయాను. ఉన్నవాణ్ణి ఉన్నట్టు నిలుపునా స్తంభించిపోయాను మరో నిమిషం తర్వాత కాబోలు బయటవున్న నౌకరూ, రైటరుగారూ అక్కడకు రావడం, వాళ్ళతో హెడ్‌మాస్టరుగారు అంతకుముందు నన్ను అన్నమాటలు మళ్ళీ అని నన్ను బయటకు గెంటమని ఆజ్ఞాపించడం జరిగాయి మాటలు వినిపిస్తూనే ఉన్నాయి కాని, ఏమిటో అర్థం కాలేదు. కళ్ళు తిరుగుతున్నట్లు అనిపించింది. రైటరుగారు నన్ను నెమ్మదిగా ఉపాధ్యాయుల గదికి చేర్చి మిగతా ఉపాధ్యాయులతో అన్ని విషయాలూ చెప్పివెళ్ళారు.

కుర్చీలో కూర్చుని బల్లమీద తల ఆనించి అర్ధగంటసేపు విశ్రాంతి తీసుకొంటేనే కాని, మిత్రులైన కొంతమంది ఉపాధ్యాయులు ఉపచారాలు చేస్తేనేకాని నాకు తెలివి రాలేదు.

తెలివి వచ్చాక జరిగినదంతా అందరికీ చెప్పాను. అది విని వారంతా అప్పటి కప్పుడు సెక్రటరీగారితోనూ, ప్రెసిడెంటుగారితోనూ చెప్పివద్దాం, పదమన్నారు. "ఇంత దౌర్జన్యం ఎక్కడా వినలేదు. ఇవ్వాళ మీ కయింది, రేపు మా కవుతుంది. ఊరుకోడానికి వీల్లేదు పదండి'' అని నన్ను బలవంతపెట్టారు. కాని స్కూలు వదిలిపెట్టేదాకా అక్కడే ఉండి, తరువాత సరాసరి ఇంటికి వెళ్ళాను.

కాస్త పెందరాళే నిద్రపోదామనుకొని అందుకు ఉపక్రమిస్తూ ఉండగా శాస్త్రిగారు వచ్చారు. వస్తూనే "ఏమయ్యా, ఇంత పని జరిగితే ఆయనే వెళ్ళి రిపోర్టు ఇచ్చేదాకా వేచిఉన్నావా? మరీ ఇంత అయోమయం అయితే ఎల్లా? ఇదంతా లౌక్యం అనుకొంటున్నాడాయన. ఇది లౌక్యం కాదు. పచ్చి రౌడీతనం. దౌర్జన్యానికి దిగాడాయన. ఈ రౌడీతనం ఇవ్వాళ నీముందు ప్రదర్శించాడు. రేపు అందరితోనూ ఇల్లాగే చేస్తాడు. దౌర్జన్యం అరికట్టవలసిందే. పోదాం పదండి. ప్రెసిడెంటుగారింటికి. నేనూ వస్తాను'' అన్నారు. "వద్దులెండి. ఆయనగారు ఏం చేస్తారో చూద్దామని వుంది'' అంటే "వెధవ ఉద్యోగంకోసం కాదయ్యా ఉపా

ధ్యాయుల మర్యాదా, గౌరవమూ కాపాడడంకోసం మనం ఆయనగారి దౌర్జన్యం అరికట్టాలి. ముందు నడవండి'' అంటూ నన్ను బలవంతాన ప్రెసిడెంటుగారి ఇంటికి తీసుకొని వెళ్ళారు.

మేము ఆయనతో అన్ని విషయాలూ వివరంగా మాటాడి ఇంటికి వచ్చేసరికి చాలా పొద్దుపోయింది.

○ ○ ○ ○ ○

ఆ మరునాడు బడికి వెళ్ళీ వెళ్ళగానే హెడ్‌మాస్టరుగారు పంపిన కాగితం అందింది. క్రితంరోజు నా ప్రవర్తన బాగాలేదనీ, వెంటనే వచ్చి లిఖితంగా క్షమాపణ అందచేసుకోకపోతే పై అధికారులకు రిపోర్టు చెయ్యడం, నామీద క్రమశిక్షణ చర్య తీసుకోవడం జరుగుతాయనీ వ్రాశారు అందులో. రావుగారూ, కృష్ణయ్యగారూ ఎంతో భయపడు తున్నట్లు నటిస్తూ, నా దగ్గరకు వచ్చి "ఈ విషయంలో మా మాట వినండి, ఆయన కోపంగా ఉన్నారు వెళ్లి ఓ ముక్క అనేసి రండి. మీ మంచి కోరే చెబుతున్నాము'' అన్నారు.

నాకు నవ్వు వచ్చింది. ఎంత పెద్ద ఎత్తు వేశారా అనిపించింది. మగతా ఉపాధ్యాయులంతా "ఇది కేవలం అన్యాయం. ఇంత దౌర్జన్యానికి పూనుకొంటారని మేం కలలో ఊహించలేదు. ఇంక మే మెవరమైనా కానీ, ఆయన గదిలోకి ఒంటరిగా వెళ్ళగలమా?'' అన్నారు. ఎంతో మధనపడ్డారు వారంతా, ఏమి చెయ్యడానికీ తోచక.

సాయంకాలందాకా నేను ఆయనకు సమాధానం వ్రాసిపంపలేదు. ఆ రోజుకు పని పూర్తి అయినతర్వాత వెళ్ళబోతూ ఇందులో నేను చెప్ప దగిన సంజాయిషీ ఏమీలేదనీ, కపట నాటకం ఆడి నన్ను చకితుణ్ణి చేసి నందుకు అభినందిస్తున్నాననీ వ్రాసి ఆ కాగితం నౌకరుకు ఇచ్చి ఇంటికి వెళ్లిపోయాను.

మర్నాడు నేను క్లాసుకు వెళుతుంటే ఉపాధ్యాయుల గది గుమ్మం దగ్గరే అటకాయించి మా హెడ్‌మాస్టర్‌గారు చేసిన ఆగం ఇంతా అంతా కాదు. "మీకు మర్యాద ఉన్నదా? నేను ఏదో పోనీలే పాపం. తోటి మాస్టర్ అని క్షమాపణ చెప్పుకోడానికి అవకాశం ఇస్తుంటే, ఇదా మీరు చెప్పే సమాధానం.'' అంటూ బొబ్బలుపెట్టారు.

ఏదో విధంగా భయపెట్టి నన్ను లొంగదీయాలని ఆయన విశ్వ ప్రయత్నం చేశారు. ఎన్నెన్నో అసందర్భపు మాటలు అన్నారు. మధ్యలో శాస్త్రిగారి ప్రస్తావన తెచ్చి ఆయనకు పట్టినగతే నాకూ పడు తుందని బెదిరించారు. నాకు నిజంగా పట్టరాని అసహ్యం కలిగింది. కోపం వచ్చింది. ఆయన నోటికి తాళం వెయ్యడానికి ఏదో ఒకటి అందామని గట్టిగా అనిపించింది. ఇదంతా కేవలం నన్ను రెచ్చగొట్టడానికే చేసున్నా రనీ, అందుకే ఆయన ఇంత నీచానికి దిగారనీ, ఆయన మాటలకు నేనూ రెచ్చిపోయి ఆయనలాగే ప్రవర్తిస్తే ఇద్దరం సమానం అవుతామనీ నాకు స్ఫురణకు రావడంచేత అసహ్యం, కోపం అణుచుకొన్నాను. కొంతసేపు అరిచి ఆయనే వెళ్ళిపోయారు. మధ్యాహ్నం మూడింటికల్లా నన్ను సస్పెండుచేస్తూ ఆర్డరు పుట్టించుకొని వస్తానని బెదిరించి మరీ వెళ్ళారు.

అందరూ నిజంగానే భయపడ్డారు. నాకూ మనస్సులో కొంత భయం కలిగింది 'పాముతో పనికదా' అనీ, ఏమి జరిగినా ఆశ్చర్య పడనక్కర్లేదనీ అనుకొన్నాను.

o o o o o

సాయంత్రం చివరిగంట అయాక మేమందరం ఉపాధ్యాయుల గదికి వస్తున్నాము. ఇంతలో మా హెడ్‌మాస్టరుగారి గదిముందుకు ఓచిన్న కారు వచ్చి ఆగింది. కారులోనుంచి ముందు ప్రెసిడెంటుగారు, తర్వాత సెక్రటరీగారు, ఆయన వెనక కాశ్మీరు శాలువ కప్పుకొని శాస్త్రిగారు దిగారు.

ఏమా ఇది అని మేమంతా అక్కడికి వెళ్ళాము.

ప్రెసిడెంటుగారు నిజంగా గొప్ప లౌక్యం కనిపించుకొన్నారు ఉపా ధ్యాయులందరినీ అక్కడికక్కడ వెంటనే సమావేశపరిచి ఆ సమా వేశంలో క్రమశిక్షణ, పాఠశాల అభివృద్ధి వంటి సాధారణ విషయాల గురించి రెండు మాటలు చెప్పి, ఏదో ప్రసంగవశాత్తు చెబుతున్నట్లుగా "శాస్త్రిగారు హైకోర్టులో నెగ్గారు రేపటినుంచే స్కూల్లో చేర్చుకోమనీ, గత సంవత్సరం జీతం లెక్కకట్టి ఇమ్మనీ కోర్టువారు ఉత్తరువులు జారీ చేశారు. ప్రభుత్వం కూడా హైకోర్టు ఆజ్ఞను గౌరవించి తదను గుణంగా నడుచుకోవలసిందే'' అని అసలు విషయం చెప్పి హెడ్‌మాస్టర్

